# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100067426

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# చెన్నకేశవ స్వామి శతకము

కవితా సంపుటి

**అడుగుల రామయాచారి**
B.P.P.O.L.

ప్రథమ ముద్రణ
ఏప్రిల్ - 1999

ప్రతులు 1000

ముద్రణ :
**క్వాలిటీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
వెంకటరమణ కాంప్లెక్స్
ఆర్.టి.సి. బస్టాండు ఎదురుగా,
ఒంగోలు.

ప్రతులకు :
**రావి. ఆంజనేయులు**
దైవాలరావూరు
కొరిశపాడు మండలం
ప్రకాశం జిల్లా - 523 212.

# ముందుమాట

**డాక్టర్. నాగభైరవ కోటేశ్వరరావు డి.లిట్**
ఒంగోలు

*అవును "దైవాలరావూరు" అంటే నాకు పుట్టిన వూరుపట్ల ఉన్నంత గౌరవం అసలు దాని మొదటి పేరు "దయ్యాల రేయూరు" దైవానికి వికృతే దయ్యం దైవం అన్నా దయ్యం అన్నా ఒకటే అర్థం దయ్యాలరేయు ఊరు అది ఎందుకొచ్చిందో దానికి నేను విన్నకథ ఒకటి ఉంది దానితో యిప్పుడు పనిలేదు దయ్యాల రేయూరును యెవరో ఆధునీకరించి దైవాలరావూరు చేశారు దాన్ని దైవపురి అన్నారు ఈ పుస్తకం వ్రాసినది రామయ్యగారు*

*నాకు దైవాలరావూరు పట్ల గౌరవానికి బోలెడు కారణాలున్నాయి మానాన్న ప్రాథమిక పాఠశాల ప్రధానోపాధ్యాయుడుగా తన ఉద్యోగపు చివరి 20 సం॥రాలు ఆవూళ్లో గడిపాడు ప్రాథమికోపాధ్యాయునిగా నా మొదటి 12 సంవత్సరాలు ఆ వూళ్లోనే పనిచేశాను మా నాన్న ఆవూరి మొదటి పోస్టుమాష్టరు నా మొదటి కావ్యం రంగాజమ్మ అక్కడవ్రాయబడివెలువడింది నా బాల్యంకొంత, శిఖరాగ్ర యౌవనం కొంతా ఆ వూళ్లోనే జరిగిపోయాయి*

*మా కుటుంబమావూరికి విద్యాదానం చేస్తే, ఆ వూరు మాకు తన అభిమానాన్నీ, ఆదరణనీ దానం చేసిన అన్నపూర్ణ ఆ వూరుని చుట్టుకొని నా జ్ఞాపకాల పక్షులు వాలుతున్నాయి*

*అప్పటికే వూరు దాటి వెళ్లిన తాడిగడప శేషయ్యగారి సంగీతం*

*హరిశ్చంద్రుణ్ణి తలపించే ఆదర్శమూర్తి పోలినేని హనుమయ్య పంచాయతీ అధ్యక్షం*

*చంద్రపాటి వెంకట సుబ్బారావు అందమైన కరణీకం - పింగళి లక్ష్మీకాంతం ఆచార్యత్వం, వేదాంతం పున్నమాచార్యులు గారి వైద్యం "చక్రయ్య పంతులు" గారి అర్చకత్వం యడవల్లి వెంకట శేషయ్యగారి పౌరోహిత్యం, మద్దినేని పోతురాజు యువనాయకత్వం - భీమనిశేషయ్య పెద్దరికం, ముత్తవరపు యల్లమంద పౌరాణికనటన. ఇవి నా సజీవ జ్ఞాపకాల్లో కొన్ని.*

*వారంతా ఆలివర్‌గోల్డ్ స్మిత్ డెసర్టడ్ విలేజిలోని పాత్రల్లా వ్యక్తిత్వమున్న మనుషులు ఇప్పడా వ్యక్తిత్వం పోయింది దైవాలరావూరు డిక్టిక్ విలేజ్‌లా మిగిలింది.*

*ఆ తర్వాతి తరంలో చింతామణి పద్యాల ఫేం ముమ్మన వీరరాఘవులూ, రంగనాయకులూ, ఎవర్‌గ్రీన్ వ్యక్తి పాతూరి పోతురాజా, పోలినేని రంగనాయకులూ జ్ఞాపకాలవెలుగులు. భీమని సత్యనారాయణ ఆ వూరి మొదటి పెద్ద సూర్యం చదువరి*

*నా తరంలో భీమని పూర్ణానందంది పెద్దకథ. కొప్పరావూరు సూర్యంది ఒక కలకకళ వాళ్లూ నేనూ ఇంకా మాకారు కుర్రాళ్లతో సాంఘిక నాటకాలు తొలిగా ప్రదర్శించాము. "కరుణామయి" ఆ వూళ్లో ఈవూళ్లో ఆడడం ఒక తీపి జ్ఞాపకం*

*లింగా వెంకటరత్నం ఊరుదాటి జాతీయ స్థాయిలో అవార్డులు తనకు తెచ్చుకొని ఊరికి పేరు తెచ్చాడు.*

*నా మొదటి శిష్యులు భవాని శంకర్రావూ, రావి వెంకటేశ్వర్లూ, ... నాకు శిష్యులై నన్ను అన్నగా గౌరవించారు. వాళ్లవల్ల నా కీర్తి పెరిగింది. ఇలారాస్తే నా ఆత్మకథ అవతుందిగాని పుస్తక పీఠిక కాదు. రావి ఆంజనేయులు నాశిష్యుడు కాని శిష్యుడు. పద్యాన్ని భావయుక్తంగా పలకగలిగి - రాగయుక్తముగా ఆలపించగలిన భావకుడు.*



వ్యాపారంలోపారం చేరగలిగి, సంస్కృతికి తనవంతు కర్తవ్యం నెరవేర్చదలచి అటు దేవాలయ పునరుద్ధరణ బాధ్యతా, ఇటు అడుగుల రామయాచార్యగారు వ్రాసిన చెన్నకేశవ శతకముద్రణ, అంకిత స్వీకార బాధ్యతా రెండు కళ్ళుగా భావించిన యోగ్యుడు.

చెన్నకేశవస్వామి దైవాలరావూరు గ్రామం మధ్యలో వేంచేసి వున్న దైవం అడుగుల రామయాచార్య వారిపేరిట శతకం వ్రాశాడు. అది భక్తిశతకం

శతకం తెలుగులో వుండి, యితర భారతీయ భాషల్లో లేని విశిష్టప్రక్రియ రామయాచార్య హైస్కూల్లో తెలుగు పండితుడు అంతర్యంలో సద్భాషా భూషామండితుడు ఇంతకు ముందు కొన్ని గ్రంథాలు వ్రాసినా, ఈ శతకంతో పద్యంలో పట్టు అందిపుచ్చుకున్నవాడు వృత్తాలు నడపటంలో దిట్ట. దైవాలరావూరుకు కొంత చరిత్రవుంది ఆచరిత్ర రేఖామాత్రంగా చెప్పాలనే కోరిక నాకుంది తెలుసుకోవటం ఇష్టపడేకొందరు దీనిని చదువవచ్చు ఇష్టం లేనివాళ్ళు ఈ పేజీలు తిప్పిదాటి పోవచ్చు

దైవాలరావూరు నెల్లూరు జిల్లాలో వుండేది బొల్లవరప్పాడు ప్రధాన గ్రామం దైవాలరావూరు శివారు గ్రామం

1218నాటి రెండు శాసనాలు చెన్నకేశవస్వామి దేవాలయం ముందు లభించాయి

ఆ శాసనాల్లో విషయం శకసంవత్సరం 1440లో శ్రీమాన్ మహామండలేశ్వర కాకతీయ గణపతి మహారాజులు పాతశాసనాన్ని చూచి, ఈ అగ్రహారం బ్రాహ్మణులకు యివ్వబడిందని తెలుసుకున్నారు

దాని హద్దులు

| | | |
|---|---|---|
| తూర్పు | - | రేకులకుంట |
| దక్షిణం | - | నదీతీరం |
| పడమర | - | బైరెడ్డికుంట |
| ఉత్తరం | - | దుర్గామూలకుంట |

దీన్ని కాదన్నవారు వేయి ఆవులను గంగఒడ్డున చంపినంత పావం మూటకట్టుకుంటారు కాశీలో హత్యచేసినంత పాపం పొందుతారు వాళ్ళపెద్దకొడుకుల పుర్రెలోని మాంసాన్ని తిన్నంత పాపం ముట్టు కుంటుంది. ఇది శాసనపారం

1227లో (శక 1149లో) ఇంకొల్లు శాసనం మల్లిదేవచోడ మహారాజులు వేయించారు ఆయన విలోచనత్రిలోచన అనే వారిచేత పాదాభివందనం పొందారు. ఆయన కరికాల కుటుంబానికి చెందినవారు. కావేరీనదికి ఆనకట్ట కట్టినవారు. ఆయన యీ అగ్రహారానికి తక్కెళ్ళపాడును దానం చేశారు. ఈ రెండు వూళ్ళూ (దైవాలరావూరు - తక్కెళ్ళపాడు) కమ్మనాడులో వున్నాయి. బ్రాహ్మణ అగ్రహారం.

1155 నాటి మరొక శాసనం ఈ గ్రామానికి పడమట వున్న చెరువుకట్టపై లభించింది.

ఈ శాసనం దేవరాయలు వేయించారు ఆయన మాదజయ్య, అనే శివాలయం స్థపతికి (అర్చకుడు) పదివుట్ల భూమిని పూజాదికాలకోసం దానం చేశాడు. పుట్టి అంటే గొర్రు కావచ్చు. కాకపోతే కొంతభూమి. ఈ అర్చకుడు రామేశ్వర దేవునికికూడా పూజారిగా వ్యవహిస్తారు.

(అంటే యీవూళ్ళో శివాలయం వుండి వుంటుంది. అదికాక రామేశ్వర దేవాలయం వుండి వుంటుంది. అవిభూస్థాపితం అయివుంటాయి).

ఈ శాసనాన్ని పాటించినవారు కోటి ఆవులు దానం చేసినంత పుణ్యం పొందుతారు. పాటించనివారు వేయి కపిల ధేనువులను గంగ ఒడ్డున చంపినంత పాపాన్ని పెద్దకొడుకు

పుర్రెలోని మాంసాన్ని తిన్నంత పాపాన్ని పొందుతారు అని యీ శాసనం చెపుతుంది.

ఇక మూడో శాసనం రెండేళ్లముందుది 1153 నాటిది విషమసంక్రాంతిరోజు వేయబడింది. మహామండలేశ్వర త్రిభువన దేవచోళ మహారాజు వేయించారు. ఆయన పాదాలపై అనేక రాజుల చూపులు నిలిచాయి. కరికాలుని వంశంలో ఆయనపుట్టాడు. కావేరికి ఆనకట్ట కట్టాడు ఆయన యమ, నియమ, స్వాధ్యాయ, ధ్యాన, సమాధి విద్యల నెరిగినవాడు

ఈయన కూడా పై శాసనాన్ని మన్నించి రామేశ్వర దేవుని అర్చకుడయిన మాధవాచార్యుల వారికి పై దానిన్ని అంగీకరించారు

దీన్ని తిరస్కరించినవారు కాశీలో ఒక ఆవును చంపిన పాపం మూటగట్టుకుంటారు.

చివరి శాసనం చింతాలమ్మ గుడికి యెదురుగా లభించింది శాసనకాలం తెలియదు చింతాలమ్మ గుడియేమయిందో! ఈ వూరు దయ్యాలరేయూరు

ఈ శాసనం రాజులు వేయించలేదు దయ్యాలరేయూరు గ్రామపెద్దలు వేయించారు

పట్టెలకాటన్న అనేవానికి చింతాలమ్మ పూజాదికములకు గాను ఒక పుట్టిపొలం యిచ్చారు

గ్రామ పెద్దలేకాక గ్రామంలోని ఎరవరాటిముదు వేనయ్య, నేయికాను బోయుడు అనేమోతుబరి రైతులు చెరొక పుట్టిపొలాన్ని చింతాలమ్మ పూజలకు ఆ అర్చకునికే దానం చేశారు

ఇవీ యీ వూరికి చెందిన శాసనాలు దీన్ని బట్టి యీ చెన్నకేశ్వరస్వామి దేవాలయం 900 సంవత్సరాలకు పైగా యీ గ్రామంలో వుంది దాని నిర్వహణకు రాజులు మండలేశ్వరులూ దానాలు చేశారు

మొదటి అర్చకుడు మాదా జియ్యనుండి యిప్పటి అర్చకుడు పరావరం వెంకటేశ్వరాచార్యుల వరకు ఎంద రెందరు యీ చెన్నకేశవుని పూజించారో?

ఇప్పడు ఈ జీర్ణాలయ పునరుద్ధరణను అంకిత భావంతో చేపట్టినవారు మాజీ సర్పంచ్, ప్రజాహితజీవి రావి హనుమంతరావు. ప్రభుత్వ పరంగా అర్థికసాయం చేయించినవారు ఈ వూరికి చెందిన పోలీసాఫీసర్ పరమభక్తుడు ఆర్.సి. దాచా. వెంకటేశ్వర్లు ఐ.పి.యస్. సహాయమందించినవాడు మిత్రులూ, భక్తులూ దాతలన్నూ, ఈ పునరుద్ధరణ క్రతువులో నేనుకూడా ఒక సమిధనందించాను. నా జీవిత సహచారి నాగరత్నమ్మ జ్ఞాపకంగా 5వేల రూపాయలు విరాళమిచ్చాము.

అడుగుల రామయ్యచారి వ్రాసిన ఈ శతకంలో భక్తివుంది. పురాణగాథ వుంది.

దశావతార వర్ణనం బాగుంది పద్యాల్లో శయ్య మనోజ్ఞంగావుంది. ధార చిక్కగా వుంది.

ఈ శతకం ద్వారా కర్త రామయాచార్య,కృతి భర్త రావి ఆంజనేయులు. వారికి సుకృతం ప్రాప్తిస్తుంది. అస్తు.

**డా॥ నాగభైరవ కోటేశ్వరరావు.**

# కవితా ఉపాసనము

సాహిత్య సమారాధక కవితాకళానిధి పరిశోధక పంచానన
**కపిలవాయి లింగమూర్తి**
ఎం.ఎ.యం. ఓ.యల్.
వాణీసదనం, విద్యానగర్ కాలని, నాగర్ కర్నూలు, ఆం.ప్ర

వృత్తకవి ఉత్తమకవి, పద్యకవి మధ్యమకవి, శ్లోకకవి కనిష్టకవి అని కవిలోక నిర్వచనము. అయితే శ్లోకమైనా పద్యమైనా - శ్లోకానికి యతి ప్రాసనియము లేకపోవచ్చుగాక. ఊతపదం, పాదపూరణం, జల్లి అపశబ్దము అనేవి దొర్లకుండా ప్రతి పదము అర్థవంతముగా ఔచిత్యవంతముగా ఉండేటట్లు పద్యమువ్రాయటం ఏ కవికైనా కత్తిమీదసామే.

పాలుకురికి సోమనాధుడు వడ్లు, పెరుగు కలిపి పిసికినట్లుంటే కృతులు కృతులేనా అంటాడు. అంటే శబ్దాలు దోషరహితముగా వుండటం ఒక ఎత్తు. అవి తమసామర్థ్యముతో పొందుపొసగి రమ్యముగా కనిపించటము, శ్రావ్యముగా వినిపించటము మరోఎత్తు ప్రబంధకవులంతా పద్యము యొక్క వడుపులన్నీ బాగా వడిసి పట్టుకున్నారు అందుకే భారత బాగవతాలలోని పద్యాలు ప్రాచీనుల నాల్కలే ఆకులుగా నిలచినవి

ఇక యీనాటి కవికంతటి శబ్దపటిమలేకున్నా కవితాభావనాదారిద్ర్యం మాత్రము లేదు. కవిత్వం వేరు పాండిత్యం వేరు. కవిత్వం భావన అంటే ఊహాసంబంధి పాండిత్యం అంటే నైఘంటిక పరిశ్రమ కేవలం నైఘంటిక పరిశ్రమ చేతనే ఏకవికైనా కవిత్వం సాధ్యం కాదు. అతనిలో ఎంతోకొంత ప్రకృతి స్పందనముండవలెను. అదిలేనివాడు కవికాజాలడు. అదివున్న వానికి నిఘంటు పరిశ్రమ చాలకున్నా కవి కాగలడు.

మిత్రుడు శ్రీ అడుగుల రామయ్యగారు ప్రసిద్ధులైన యిద్దరు కవులు అనగా పల్నాడు సోదరకవులలో ఒకడైన శ్రీ కన్నెకంటి వీరభద్రాచారి గారి, "సౌజన్యశ్రీ" బాలసరస్వతీ కుటీరడైన వంగపోలు ఆదిశేష శాస్త్రిగారి నలహాలను పాటించి, వారి ఒరవడిలో కవితనుడవ నేర్చినాడు. కాబట్టి కవితాభావనకు కొదువలేదు. ప్రస్తుతమైన యీ చెన్నకేశవ శతకమును, తత్వ విచారములో మానసబోధ శతకమును తలపించు చున్నవి.

కవికి కావ్యరచన వేరు, శతకరచన వేరు, దీన్ని కవి సమయాలుగాని, వ్యాకరణ శృంఖలాలు గాని, బాధించవు. శతకము కవులకు స్వేచ్ఛా విహారభూమి శతకములో వ్యాకరణ నిబద్ధాలు కంటే లౌకిక ప్రయోగాలే ఎక్కువ. మిత్రుడు రామయ్యగారు ఇంతకుముందే "హనుమత్కల్యాణాది" కావ్యాలు రచించి చేయి తిరిగిన వారు గనుక యీ శతక రచన చక్కని ధారతో సమర్థంగా, సరసంగా నడిచింది. వీరి కవితా లత యిటులే సాగి యింకనూ అపూర్వకుసుమము లందించవలెనని ఆశిస్తున్నాను.

# ముఖతిలకము

నాట్యావధాని, కళాస్రష్ట
డా॥ ధారా రామనాథశాస్త్రి ఎం.ఎ. పిహెచ్.డి.
ఇ.కె. నివాస్. మామిడిపాలెం, ఒంగోలు.

కవిమిత్రులు శ్రీ అడుగుల రామయాచారి రచించిన "చెన్నకేశవ శతకము' నేనాసాంతము చదివి ఆనందించితిని. అంతకు మున్నువారు రచించిన హనుమత్కల్యాణమును గూడా చదివితిని. రామయాచారి నిరంతర సాహిత్యసేవా పరాయణులనియు, సంప్రదాయ మార్గమున చక్కని కృషి సలుపుచున్న కవి పండితులనియు నాకవగతమైనది. అందుచేత వారి శతకమును గూర్చి కొలది పరిచయము చేయుట నాకు ప్రీతికరమైన విషయము.

ఆంధ్రవాఙ్మయమున శతకమొక ప్రత్యేకశాఖగ విస్తరిల్లి, కవి పాఠకలోకమునకు సమానముగ వుపాధేయమైనది. కవితన మనోభావమును స్వేచ్ఛగా వ్యక్తీకరించి ఒక దైవమును గూర్చిగాని, సామాజిక విషయమును గూర్చిగాని, నీతి తత్వాది, విషయములను గూర్చిగాని ఇట్లెన్నియో తెఅగుల ఆత్మనివేదన మొనర్చుటకు అవకాశము గల్పించు ప్రక్రియ శతకము. ఆత్మీయతా ముద్రకు బహుశః శతకములో నున్నంత ఆకరము అన్యసాహిత్య ప్రక్రియలలో కనుపించదు. ఒక విధముగ వస్తుగతముగ శతకము పరాశ్రయమైనచో కవిగతముగ ఆత్మాశ్రయము. ఈ రెండు మార్గములకు విభజనరేఖ గీయుట కష్టము. కాని శతకమున ఆత్మాశ్రయ పరాశ్రయములకు చక్కని సమన్వయము కనుపించుననుటలో అభ్యంతరము లేదు.

చెన్నకేశవ శతకము పై పద్ధతికి లక్ష్యప్రాయమైరామయాచారి కవితాస్ఫూర్తికి దర్పణమై విరాజిల్లుచున్నది. చక్కని పాండిత్యము చిక్కని భావనలున్న కవికి వీని విన్యాస వైఖరిలో ధారా శుద్ధి రచనా శిల్పము తోడుపడినచో ఆకవిత్వము వన్నెకెక్కును. ఆచార్యుల వారి కవితలో యీ హంగులన్నియు అమరియున్నవి.

స్వామి దయవలన కవిగారి యితోధిక సాహిత్య కృషివలన వారి లేఖిని నుండి మరింత గుణవంతములైన రసవత్కావ్యములు వెలువడవలయునని ఆశింతును. ఆచార్యా! మీ పద్ధతి బాగున్నది మీ శతకము నాకు నచ్చినది అని అభినందించు చున్నాను.

# పచ్చల పతకం

సాహిత్య సరస్వతి
డా॥ కన్నెగంటి రాజమల్లాచారి ఎం.ఎ. పిహెచ్.డి.
మార్కాపురం

కవిత్వ లోకానికి కార్బన్ కాపీ కాగూడదు మెదడుకు బలము నిచ్చేటానికిక్కుగా పనిచేయాలి కనీసం ఒక్క విటమిన్ మాత్రగానైనా పనిచేయ్యాలి కవితకు ధ్వని ప్రాణం. ధ్వని గౌరవం లేని కవిత బొట్టులేని స్త్రీ లాంటిది

సుప్రసిద్ధ కవులు శ్రీ అడుగుల రామయాచార్య గారి కవిత సంపూర్ణ లక్షణ శోభితంగా వుంది. ఈయన కవిత ధారాశుద్ధి సువర్ణమయమ్మై సూక్తి సుధాభరితమ్మై, ధ్వనిగౌరవం కలిగి అలంకార కవితయై అలరారుతూ ఉత్తమ గుణాన్వితమ్మై రాజిల్లుతూ వుంది.

ప్రథమంగా దైవస్తుతిలో దైవాలరావూరు కవి వ్యక్తిత్వం తలయెత్తింది. మొదట బ్రాహ్మస్తుతివుంది బ్రహ్మ సృష్టి కర్త కవి బ్రహ్మ కావ్యసృష్టికర్త కనుకనే కవి బహ్మకు (చతుర్ముఖునకు) అగ్రతాంబూలమిచ్చి ఆరాధించటం సముచితంగా వుంది.

సరస్వతీదేవి లేనిదే వర్ణార్ణవంలేదు పదజాలంలేదు, భావంలేదు కవికి సరస్వతి తల్లి. కనుక సరస్వతిని వెంటనే స్తుతితించటం కవికి చదువులమ్మ మీద గల భక్తిని ప్రకటిస్తూ వుంది

ఇష్టదేవతాస్తుతి వెంటనే కవిజననీ జనకుల సంస్మరణంజేసి, తల్లిదండ్రి గురువు దైవం అనే భావాన్ని స్ఫురింపజేశారు కనిపించని దేవతలకు స్తుతివినిపించి తరువాత, కనుపించి కనిపెంచిన దేవతలను మరువక పోవటం సముచితంగా వుంది.

శతకారంభంలో ఆదిదేవుడు చెన్నని దశావతారాలను వర్ణించాడు. పరశురామావతారం వరకూ ఒక్కొక్క పద్యం చెప్పాడు రామావతారాన్ని నాలుగు పద్యాలకు పెంచారు. తరువాత చెన్నకేశవుని అవతారమైన కృష్ణ విగ్రహాన్ని లీలామానుషవిగ్రహంగా దలంచి పదునైదు పద్యాల్లో వర్ణించటం బాగుంది. తన శతకాధిపతి వైష్ణవమూర్తి గనుక ఈ ప్రత్యేకత నీయటం బాగుంది. మానవులు భక్తి మార్గంలో పయనించి తదుపరి మోక్షమార్గంలో ప్రయాణించి ముక్తిని సాధించాలి అనే ఉద్దేశ్యంతో కవి భక్తి సుధను యీ శతకంలో ప్రవహింపజేశారు. మోక్షమార్గాన్ని చూపించారు. వంద పద్యాలను వందరత్నాలుగా సానలతీర్చిదిద్ది సరస్వతీ కిరీటంలో పొదిగి మహాకవిగా ఎదిగారు

శతకాలలోని పద్యాల స్వారస్యాన్ని వర్ణిస్తూపోతే అభిప్రాయమే పుస్తకమవుతున్నది. కనుక రామయ్య కవితలోని రామణీయకతను చదువరులే చదివి గ్రహించగలరని కోరుతున్నాను. శ్రీరామయాచార్యకవి కవిత మచ్చుకు ఇలా సాగుతుంది.

"పరునములాడకన్ పరుల భార్యల దిట్టక దుష్టచిత్తులై
తిరుగక సాధుమానవుల తిట్టక కొట్టక సర్వవేళలన్
తిరముగ నిన్ను నిల్పిమది తేకువ గొల్చిన భక్తకోటికిన్
తరుగని మోక్షమిచ్చెదవు దైవపు రీహరిచెన్నకేశవా!

"మిత్రుల మంచుదేవతలు మేదిని గొల్చి తరించుచుండగా
శత్రుల మంచు రక్కసులు సంగరమందెదిరించి చావగా
మిత్రుల శత్రులందరకమేయు తరంబగు మోక్షమిచ్చి తా
చిత్రము నీ చరిత్ర సరసీరుహలోచన చెన్నకేశవా!"

శతకం నిండా యిలాంటి పద్యాలే వున్నాయి. అడుగడుగున అడుగుల రామయ్య కవి, జిగిబిగి కాంతుల పచ్చలు పొదిగి శ్రీ దైవపురీహరి మెడలో వేసిన పచ్చల పతకం ఈ శతకం.

# కృతి ప్రేరణ

నేను 1984 సంవత్సరములో మార్టూరు జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల నుండి బదిలీచేయబడి, దైవాలరావూరు జిల్లా పరిషదోన్నత పాఠశాలలో ప్రథమశ్రేణి తెలుగు పండితునిగ నియమించబడితిని. ఉద్యోగము నిర్వహించుచునే ఆలిండియా రేడియో (ఆకాశవాణి) విజయవాడకు ప్రతి ఆదివారమూ సమస్యాపూరణములు బంపుచుంటిని. కాలచక్ర పరిభ్రమణంలో ద్వాదశాబ్దాలు కనుమరుగై పదమూడవ వసంతం (సంవత్సరం) ప్రవేశించింది. దైవాలరావూరు గ్రామనివాసీ, మంచి వ్యాపారదక్షుడూ, సాహిత్యాభిలాషి, స్నేహశీలియునైన రావి ఆంజనేయులు గారితో నాకు పరిచయము జరిగినది. అంతకు ముందే ఆంజనేయులు గారు యీ ఊరి చెన్నకేశవస్వామి ఆలయ పునర్నిర్మాణ కమిటీ అధ్యక్షునిగ నియమితుడైయుండెను. ఒక రోజాయన నన్ను బిలచి నాతో నీవీ గ్రామంలో వెలసిన చెన్నకేశవ స్వామిని కీర్తిస్తూ, సరళగ్రాంధికభాషలో దైవపురీహరిచెన్నకేశవా! అనే మకుటంతో ఒక శతకమును రచించు, అది నీకూ నాకేగాక యీ గ్రామమునకు గూడా శుభదాయకము కావాలని, తెలిపి తన కోరిక గూడా శుభదాయకము కావాలని, తెలిపి తన కోరికను వ్యక్తీకరించాడు. నేనందుకంగీకరించి, యీ శతకానికి చతురుఖ స్తోత్రముతో శ్రీకారము జుట్టి అనతికాలంతో శతక రచన పూర్తిగావించితిని. నేనిదివరలో రచించిన "హనుమత్ కల్యాణ" నామక పద్య ప్రబంధమును చదివి రావి ఆంజనేయులు గారు దానిచే ప్రభావితుడై ఈశతక రచనకు నన్ను ప్రోత్సహించెను.

"దైవపురీహరి చెన్నకేశవా" అనుమకుటముతో ఉత్పలమాలా, చంపకమాలా వృత్తములతో రచింపబడిన యీ శతకమును గ్రామధికారులూ పురప్రముఖులేగాక భక్తులూ గూడా పఠిస్తుంటే నా కృషి సఫలమైనట్లు భావిస్తాను.

రచయిత
**అడుగుల రామయాచారి**

# కృతిపతి పరిచయము

చం॥ వినయగుణాన్వితుండగుచు విశ్రుతి కెక్కినరావి వంశసం
జనితుడు సుబ్బయాఖ్యునకు, సాధ్వినుశీలగు కోటమాంబకున్
తనయుడు అంజనేయుడయి ధారుణి మత్కృత పద్యసంపుటిన్
ఘనముగ ముద్రణన్ జరిపి కాంచెమహత్తర కీర్తిచంద్రికల్

2. చక్కని సాహితీ ప్రియుడు సజ్జనమిత్రుడు కార్యదక్షుడై
మిక్కిలి దానధర్మముల మేదిని జల్పుపరోపకారియై
చక్కని దైవకీర్తనల సాధనజేయుచు సత్ప్రవర్తనన్
మక్కువతోడ వర్తకము మానక చేయును నేర్పుజూపుచున్.

3. సద్గుణముల రాశి సతిమహాలక్ష్మ్మ
పేదసాదజనుల నాదరించి
దైవభక్తి గలగి ధర్మముల్ జేయుటన్
దత్తదేవుడెపుడు దయను బ్రోచు.



కృతికర్త
భాషా ప్రవీణ
అడుగుల రామయాచారి
Gr - 1 తెలుగు పండిట్

ఆరయగ జీవితాన పరమార్థము విద్యను బోధజేయుటే
సరియగు మార్గమంచెఱిగి, చక్కగనేనిటు గోరినంతనే
హరిపయి పద్యముల్నుడివి. ఆకృతి నాకిడినాదుమన్ననల్
ధరగొనె నీకవీంద్రునిక దైవపురీహరి బ్రోచునెప్పుడున్.



కృతిభర్త
రావి ఆంజనేయులు

# కవి సన్మానము

హనుమత్కల్యాణము గ్రంధావిష్కరణము తేది 25-7-91 జాతీయ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత శ్రీలింగా వెంకటరత్నము గారిచే శాలువా బహుకరణము. పాఠశాల ప్రధానోపాధ్యాయుడు మందలపు వెంకట సుబ్బయ్యగారిచే సత్కారము.

తెలుగులో పద ప్రయోగములు (దోషములు, నివారణ) గ్రంధావిష్కరణ తేది : 15-3-97 శ్రీ నాతాని భూపతిగారిచే సన్మానము.

కొరిశపాడు మండల కార్యాలయములో తే : 2-10-97న కవితా సమ్మేళనములో పద్యపఠనము. అద్దంకి శాసన సభ్యుడు డా॥ బాచిన చెంచు గరటయ్య గారిచే సన్మానము.

10-1-1999 ప్రకాశం జిల్లా రచయితల సభలో డా॥ సి నారాయణరెడ్డి గారిచే శృంగారచమత్కారచాటుర్తలు, గ్రంధావిష్కరణము, హనుమారెడ్డి గారిచే మెమొంటో సత్కారము.

# కృతజ్ఞతలు

నాచే రచింపబడిన యీ దైవాలరావూరు చెన్నకేశవ స్వామి శతకమును పండిత పామరులకు గూడ చదువగనే పద్యము నందలి భావములర్థమగునట్లు రచించుటకు ప్రయత్నించితిని. వివిధ పురాణములందలి కధలను గ్రహించి యీ శతక పద్యములలో పొందుపరచితిని. దైవచింతనగల భక్తులు రసాస్వాధనాభిలాషులగు కవి శ్రేష్ఠులు యీ పద్యములలో నిక్షిప్తములైన పురాణ కథా ఘట్టములను గ్రహించి ఆనందింప గోరుచున్నాము. యీ శతక రచనానంతరము దీనిని శుద్ధప్రతిగ (తప్పులు లేని శతకముగ) వ్రాయుటలో సహాయపడిన మహాత్మగాంధీ కాలేజీ తెలుగు లెక్చరర్ శ్రీ పి. సుబ్బారావుకు నా సహచరుడు గ్రేడ్ - 2 హిందీపండిట్ గారా శ్రీనివాసరావునకు స్నేహితుడు చిరపరిచితుడు చిత్రలేఖనోపాధ్యాయుడు మరం వీరాంజనేయులుకు అభినందనలు.

అడిగినదే తడవుగా తన అమూల్య అభిప్రాయమును వ్రాసి పంపిన గౌరవనీయులు నాట్యావధాని శ్రీ ధారా రామనాధశాస్త్రిగారికి, నమస్కృతులు. ఈ గ్రామమునకు బహు దూరమున నాగరకర్నూలులో నుండి గూడ శతకమునామూలా గ్రముగ జదివి ఓపికతో చిఋదోషములను సవరించి, పాఠాంతరములను జూపి పంపిన సాహిత్యాభిలాషి, స్నేహపాత్రుడు, సాహితీసమారాధకులు, కవితాకళానిథి, పరిశోధక పంచానన బ్రహ్మశ్రీ కపిలవాయి లింగమూర్తి గారికి నా హృదయపూర్వకాభివందనములు మరియు నా సోదరతుల్యులు పలనాటి సోదరకవుల వారసుడైన డాక్టర్ కన్నెకంటి రాజమల్లాచారిగారి అమూల్యాభిప్రాయానికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభినందనలు తెలుపుతున్నాను.

# శ్రీ దైవస్తుతి

కం॥ శ్రీయుత యౌనలు మోముల
ధీయుక్తిం వేదచయము దెలుపుచు వాణిన్
పాయక ప్రాణులకెల్లను
ఆయువునిడి సృష్టింజేయు, నజుని తలంతున్.

ఉ॥ వీణయుగ్రంథమంకుశము, విశ్రుతమౌస్ఫటికాక్ష మాలికల్
పాణుల కాంతిపుంజములు బర్వ, తనుప్రభ దిక్కులేల, గీ
ర్వాణులు సన్నుతించున జురాణిని, సైకత శ్రోణి, జాణనా
వాణి మిళింద వేణి, శుకవాణిని పల్లవపాణి గొల్చెదన్.

ఉ॥ శ్రీరమణీ మణీశుని, విచిత్ర విలాసుని, అర్థిలోకమం
దారుని, దానవాంతకుని, ధైర్యనిధిన్, మధువైరి, కంస సం
హారుని, భక్తవత్సలుని, ఆర్తశరణ్యుని, పుణ్య మంజులా
కారుని విష్ణుగొల్చి శతకమ్ము రచించెద భక్త కోటికై

ఉ॥ క్షీరసముద్రజాత, సరసీరుహలోచనురాణి, యాహరిన్
కోరి భజించు మానవుల, కోర్కెలు దీర్చెడి కల్పవల్లి, శృం
గారపు భక్తిభావముల ఖండ విధాల మదీయ జహ్వపై
జేరిచి హృద్యపద్యముల, శీఘ్రము వ్రాయగజేయు మ్రొక్కెదన్.

ఉ॥ చల్లని చంద్రునిన్‌కరము చల్లనిగంగను మౌళిదాల్చియా
హల్లకపాణి శైలజను అంకము జేర్చియు దంతి వక్త్రునిన్
అల్లనముద్దులాడు నగజాపతి, తెల్లని వెండికొండ భా
సిల్లెడు శంకరుం గొలుతు, శీఘ్రము యాకృతి వ్రాయ భక్తితో

ఉ॥ శ్రీయునువాణి యిర్వురును, చిత్రగతిన్ తమ చామరాలతో
పాయక కొల్వగాదనరి, బంధుర స్వర్ణవిభూషణా వళుల్
శ్రీయుత మౌచు దేహమున చిత్రపుకాంతుల నీను దుర్గ, భ
ద్రాయుత మూర్తి శాంకరిని తప్పకకోరి నుతింతునియ్యెడన్

కం॥ హనుమంత వాయుపుత్రా!
జననుత యో అర్కశిష్య సన్నుత పాత్రా!
ఘనమౌ సాధుచరిత్రా!
కనకనగ సమానగాత్ర! కావింతును తుల్

తే॥ భవ్య సుందరగాత్రుండు బలయుతుండు
కాంచనాద్రికి సమయైన కాంతియుతుడు
పవన తనయుండు రాముని ప్రముఖభక్తు
డాంజనేయున కిపుడు నేనంజలింతు

తే॥ జనన మిడినట్టి గుణశీల జననికోటి
శాంబకంజలి ఘటియించి చక్కనైన
పద్యముల నేర్చి కూర్చెద హృద్యముగను
శ్రీఘ్రముగ రక్షజేయు మో చెన్నకేశ!

సీ॥ స్వర్ణకారక వృత్తి వడ్రంగ మెవ్వాని
కరతలా మలకముల్ గాదనర్చె
కర్షక కార్మిక, కర్మార వృత్తులే
మాన్య చరితునిచేత మహి వెలింగె
వైద్య మెవ్వని చేత వ్యాధి పీడలణంచి
దిగ్దింతములందు తేజరిల్లె
సలలిత హాస్యోక్తి విలసితుండెవ్వాడు
పంచాక్షరీ మంత్ర పరుడెవండు
పిన్ననగు నన్ను ప్రేమతో పెద్ద జేసి
తెలుగు విద్వాంసుగా తీర్చిదిద్దినట్టి
మజ్జనకు అమృతానంద మయుదలంతు
విబుధలోకంబు నుండి దీవింప నన్ను

కం॥ అమృతానంద సునామము
అమృతం బై వ్యాధు లణచి, ఆయుర్వేదా
ద్వమృతా సారము గురిసియు
అమృత యశః శ్రీలనందె, అమృతాంశు కృపన్.

ఉ॥ నన్నయ తిక్కనాది కవినాధుల హృత్కమలాన నిల్పి, యా
సన్నుత కీర్తి పోతనకు శబ్దచమత్కృతి నీయ మ్రొక్కి, వి
ద్వన్నుతి జేసి రుద్రకవి, భట్టుకవీంద్రుని చేమకూర, వెం
కన్నల నెంచి నీదుశతకమ్ము రచించెద చెన్నకేశవా!

# శతకారంభము

ఉ॥ వారి చరావతారమునవార్ని ధిజొచ్చిన సోమకాసురున్
కోరలు బీకి చంపియు, నకుంఠబలమ్మున వేదభాగముల్
ధీరత బ్రహ్మకిచ్చిన సుధీమణి మీనపురూప నీమహో
దారత నెన్నగాతరమె, దైవపురీహరి! చెన్నకేశవా! 1

చం॥ దొరకొని దేవదానవులు, దుగ్ధపయోధి మధింప ధారుణీ
ధరమును జేసి కవ్వముగ, దానికి తాడొనరించి వాసుకిన్
తరచిన మున్నులోకములు, తల్లడమందగ కూర్మరూపి వై
అరయ భరించినట్టి పరమాత్ముడ! దైవపురీశకేశవా! 2

చం॥ ధరణిని చాపజుట్టిన విధంబున జుట్టి హిరణ్య లోచనుం
డరుగ సముద్ర గర్భమున కాతనిద్రుంచి, వరాహమూర్తి వై
ధరణిని పూర్వమున్నటుల, తావక శృంగముపైన దాల్చు, భీ
కరతరరూప వైభవ వికాసము నెంచెద చెన్నకేశవా! 3

చం॥ భీకరుడా హిరణ్యకుడు, పెద్దగదంగొని, యుక్కుకంభమున్
దాక నృసింహ మూర్తివయి, దానవు కూల్చియు మోక్షమిస్తివా
భీకర రూప తీవ్రతకు భీతిల లోకము నీ స్వరూపమున్
చేకొని భక్తు బ్రోచితివి, శీఘ్రము దైవపురీశ కేశవా! 4

చం॥ పదముల రెంట భూగగన భాగముగప్పి బలీంద్రుమస్తకం
బదిమి మరొక్క పాదమున, నాయమరేంద్రుని రాజ్యచక్రమున్
సదయతగాచి యిచ్చితివి, చక్రధరావటు రూపమెత్తి, చి
త్పదమల మూర్తివైతి గద, ధారుణి దైవపురీశకేశవా! 5

చం॥ ఇరువది యొక్కమారు ధరణీశుల గూల్చియు రక్తవార్నిధిన్
సరగున పితృతర్పణము చక్కగ జల్పియు ప్రజ్ఞజూపి యా
సురవర కోటి సన్నుతుల సుస్థిరతంగొని బ్రాహ్మణాకృతిన్
పరగిన విక్రమా క్రముడ! భార్గవరాముడ! చెన్నకేశవా! 6

ఉ॥ యుద్ధమునందు తాటకిని యుక్కణగించియు శంభువింటినో
శుద్ధచరిత్ర నీవిరచి, సొంపుగ భూసుతపెండ్లియాడి, యా
వృద్ధమహీశునాజ్ఞనటవీస్థలి శ్రీరఘురామ మూర్తివై
కృద్ధత రక్కసాధముల కొమ్మణగించితి చెన్నకేశవా! 7

ఉ॥ దేవకి గర్భవాసమున తేజము మీరగ కృష్ణమూర్తివై
నీ విలబుట్టి శీఘ్రముగ నేర్పున పూతనగూల్చి గోవులన్
కావగ శైలమెత్తి ఖలుకంసుని జంపియు కౌరవాదులన్
దేవ వధించి వేసితివి తేజము మీరగ చెన్నకేశవా! 8

చం॥ త్రిదశులు వేడినంత సుదతీమణలన్ వధియింప బుద్ధరూ
పదనున దాల్చినీవు త్రిపురాసురులన్ వధియించు నప్పుడా
కదనము నందు ఈశ్వరున కాదటనిల్చియు, నాయుధంబులన్
విధిగనునిచ్చి తోడ్పడితి వీవిల దైవపురీశకేశవా! 9

ఉ॥ పాపపు ఘోరకృత్యముల, పంకిలమైన జగంబు గావ యా
టోపము మీర ధీరతసహోయని భద్ర తురంగ మెక్కి, సం
దీపిత ఖడ్గముంద గొనియు దీర్ఘత నాకలికావ తారతన్
మాపుదు దుర్జనత్వమును మాధవ దైవపురీశ కేశవా! 10

# రామావతార పద్యములు

చం॥ సలలిత నీదునామ జపసారమెఱింగి తరింపజాల నీ
విలసిత పాదపద్మముల వేమరు గొల్వ గుహుండ గాను, నిన్
దలపగ రాణాఖ్యునకు తమ్ముడగాను, భవద్విలాసముల్
తెలిసినుతింప నాతరమె దైవపురీహరి చెన్నకేశవా! 11

ఉ॥ పాదము జోకి యొక్క శిల భామగ మారెను దేవదేవ! నీ
పాద సరోరుహంబులను పాయక గొల్చెద భక్తితోడ! నా
బాధలు మాన్పి దుఃఖ భవబంధ వియోచను జేసి కావుమో
శ్రీదసమస్త లోక పరిపాలక ! శ్రీహరి చెన్నకేశవా! 12

ఉ॥ పాతకి తాటకిందునిమి పావనుడంచు జగబులోన, ప్ర
ఖ్యాతి వహించి నావు చెడుకార్యము జేసెడి దుర్జనావళిన్
యాతనలంద జేయక దయారసమున్ దగనిచ్చి ప్రోతువో
పూతచరిత్ర వేడెదను పుణ్యుడ శ్రీహరి చెన్నకేశవా! 13

ఉ॥ ధాతవు నీవటంచు భవతారకమంత్రము లోకమందు, వి
ఖ్యాతిని గన్నదంచు వినయమ్మున దాని జపించుచుండి నిన్
ధాతను గన్న తండ్రివని ధ్యానము జేసెద దేవవేగ నిన్
యాతజీ గొల్చు భక్తతతి నింపుగ గావుము చెన్నకేశవా! 14

ఉ॥ యాదవ వంశ సంభవ నిజాశ్రిత మౌని జనైక లోల ! ప్ర
హ్లాద వినోదలీల కరియార్తిని బాపిన భక్తపాల! నం
పాదిత పుణ్యశ్లోక! మునివందిత గానవిలోల! సజ్జనా
హ్లాదకరా నుతింతు నిను దైవపురీ హరి చెన్నకేశవా! 15

ఉ॥ చిన్న తనాన నీవు సరసీరుహలోచన క్రీడలాడుచో
మన్నును మెక్కెకృష్ణు డనుమానము లేదని చెప్పగోపకుల్,
మన్నిటులేల దింటివని మాధవుడిట్ట యశోద, కాస్యమం
దెన్నచరా చరాండము లనేకము జూపితి చెన్నకేశవా! 16

చం॥ అరయగ సర్వసంపదలనంతముగాయాకుచేలునిన్
త్వరగతి బ్రోచికుబ్జకు నుదారత సుందర రూపమిచ్చి యా
కురుసభలోన ద్రౌపదియు కోరగ వస్త్రమొసంగి లీలలం
బరగిన స్వప్రకాశ! ప్రతిభాన్విత దైవపురీశ కేశవా! 17

ఉ॥ కౌరవసేననెల్ల రణకౌశలమొప్ప వధింపజేసి యా
భారతభూమి నిచ్చితివి భాసురకీర్తికి ధర్మరాజుకున్
గౌరవ కీర్తి సంపదల గణ్యముగాగ కిరీటికిచ్చి తో
శౌరి కృపాంతరంగ దయశాలివి దైవపురీశ కేశవా! 18

ఉ॥ పార్థుడు యుద్ధమందున అపారవిషాదమునొంది మోహమున్
దుర్దశ బాప వేడగనె తోయ రుహానన విశ్వరూపమున్
ఇద్ధర జూపి గీతను వచించిన శౌరివి దైవమంచు నిన్
ప్రార్థన జేసి కొల్చెదను, భక్తిగ దైవపురీశ కేశవా! 19

చం॥ అరయకళింద జానదిన యారయకాళియు మస్తమెక్కి స
త్వరగతి పాద తాడనల దర్పమణంచగ గజ్జెలందియల్
స్ఫురిత మనోజ్ఞమైకదల సొంపగు నాదములుద్భవింప నీ
ధరణిన గోపకుల్ గనిరి తావక నృత్యము చెన్నకేశవా! 20

ఉ॥ పొందుల విందులంచు నిను పొందగ గోరియు గోపికాంగనల్
చిందుల ద్రొక్కి యాడగని, చిత్రముగన్ తగమోహనాకృతిన్
నందకుమార వారి నయనమ్ముల కందర, కన్నిరూపులై
అందరి కోర్కెదీర్చితివి హాయిగ దైవపురీశ కేశవా! 21

ఉ॥ ద్రౌణి అపాండవమ్మనుచు, బ్రహ్మశిరంబను అస్త్రరాజమున్
ప్రాణహతమ్ముగా బనుప, పాండవ రక్షణ చేయబూని, ని
ద్రాణుని యుత్తరాసుతుని, తావక దివ్యకటాక్ష వీక్షణన్
ప్రాణము నిల్పి కాచితివి, భాసురకీర్తిన చెన్నకేశవా! 22

ఉ॥ ఎన్నియొ  సంపదల్గలిగి, యొగ్గుదలంపక, గొల్లయిండ్లలో
జున్నులు వెన్నపాల్పెరుగు జోకుగ దొంగిలు నల్లనయ్య! నీ
కన్నను వేరు దైవములు, కాంచగ లేరని నమ్మి నామదిన్
ఎన్ని భజింతు నీమహిమ, వేమరు దైవపురీశ కేశవా! 23

ఉ॥ నందుని గోగణాన యదునందు లెల్లరు గొల్వ, గోపికా
బృందపు వేణుగానము నిలింపులు మెచ్చగ, మోహనాకృతిన్
బొంది, కళింద జాతటిన పొల్పుగు నృత్య మొనర్చినట్టి, నీ
చందము సంస్మరించెదను, సాధుజనావన చెన్నకేశవా! 24

ఉ॥ వాసవుడంత కోపమున వారివయిన్ వడిరాళ్ళు రువ్వ, నా
యాసముతోడ కావుమని, యాదవులందరు వేడినంత, సం
త్రాసము దీర్ప కొండనతి రమ్యత నెత్తియు గోగణమ్మును
ల్లాసము తోడ ప్రోచితివిలాసముగా హరిచెన్నకేశవా! 25

చం॥ సురముని పుష్పముంగొనియు సొంపుగకృష్ణునికిచ్చి నంతనే
కరమను రక్తినారదుడెకాయెకి సత్యకుజెప్ప శీఘ్రమా
సురపతి సంగరానకడు శూరతగెల్చియు పారిజాతమున్
కరివరయాన కిచ్చితివి, కాళియ మర్దన చెన్నకేశవా! 26

ఉ॥ ఇందుని భాననా! సురల నింపుగ గాచిన దేవ! దేవకీ
నందన! గోపికారమణ! నాతిని లక్షణ సూర్యాకూతు కా
ళిందినదీతటాన నివు లీలగ పెండిలియాడి కృష్ణ యా
నందము గొల్ప వేణు రవమాధృతి జేసితి చెన్నకేశవా! 27

ఉ॥ పన్నగశాయి నీవు మునుపార్థుడు యాత్రకు బోయివచ్చినన్
కన్నె సుభద్ర నాతనికి గ్రక్కున నీయదలంచినంత, నీ
అన్నగ్రహించి యుగ్రుడయి నాతనకీయ నటంచు బల్కగా
చెన్నుగ శక్తియుక్తులను చేసితి పెండ్లిని చెన్నకేశవా! 28

చం॥ విజయుడు తొల్లి యుద్ధమున వేసరి యెంతొ విషాదమందినన్
నిజమగు గీతసారమతి నేర్పున దెల్పియు విశ్వరూపమం
దజునునెకాక రుద్రని విహాయన సర్వచరాచరంబులన్
గజిబిజి లేక చూపగనె జ్ఞానము నందిన పార్థుడంత, యో
గజవరదుండ! కౌరవుల గ్రక్కున గెల్చెను చెన్నకేశవా! 29

ఉ॥ నీవును భీముడర్జునుడు నేర్పున బ్రాహ్మణవేష ధారులై
కావరుడా గజాసురుని కయ్యములాడగ బిల్చి నేర్పునన్
బవరము నందు భీమునిచె భీకరలీల వధింపజేసి యా
భువిని కుమారుకిచ్చితివి, భూజన సంస్తుత! చెన్నకేశవా! 30

చం॥ కరివరదుండ వౌచు కమలాసన ముఖ్యులచేత పూజలన్
మరిమరి గొంచు భక్తజన మానసమందు వసించి యార్తులన్
కరమలరంగఁబ్రోచి ఘన కామితముల్ తగదీర్చు చుండి. యీ
పురజన పూజలందుమయ, భూరి కృపాకర చెన్నకేశవా! 31

ఉ॥ గొల్లపడంతు లెల్లరను, గొబ్బున వస్త్రము లన్నివిప్పి, సం
పుల్లసరోజ నీరముల పొల్పుగ స్నానములాడ కృష్ణ!క యా
గొల్లల మేనివస్త్రములు కొల్లగ దొంగిలి వారువేడ, నీ
వుల్లసమాడి యిచ్చితివి ఓహరి నేర్పుగ, చెన్నకేశవా! 32

చం॥ కరముల బాదపెట్టినను కంసహారా! నినురోట గట్టినన్
తరుగని ప్రేమ గొట్టినను, తప్పుల నెంచియునిన్ను తిట్టినన్
మురహర మోదఖేదముల ముద్దుగుల్కి, యశోద జేరి, నీ
కరముల కండ్లు మూసితివి, గ్రక్కున దైవపురీశ, కేశవా! 33

ఉ॥ శ్రీరమణీ మణీశుడ విచిత్ర విలాసుడ! అర్థిలోకమం
దారుడ! దానవాంతకుడ! ధైర్యనిధీ! మధువైరి కంస సం
హారుడ! భక్తవత్సలుడ ఆర్త శరణ్యుడవంచు నిన్మదిన్
చేరిచికొల్చు భక్తతతి శీఘ్రమెకావుము చెన్నకేశవా! 34

ఉ॥ ఏమని విన్నవింతు నికనెట్లు నుతించెద నీదు శక్తినే
నేమనువాడ పామరుల నిందనుబాప తురంగమెక్కి మున్
భీమబలాన జాంబవతు భీకరరీతి జయించి, కృష్ణ యా
భామను పెండ్లి యాడితివి లీలగదైవపురీశ కేశవా! 35

# మోక్ష సంబంధ పద్యములు

ఉ॥ నీరములింకి పంకమున యీల్గెడి మీను భయమ్ము తోడ తా
నీరము లోనికిన్ జొరగ నిక్కపు యత్నము జేయురీతి, యీ
సారవిహీన జీవిత రసార్ణవమీదగ జూచుచుంటి సం
స్కార యుతంపు జ్ఞానమిడి చక్కగ బ్రోవుము చెన్నకేశవా! 36

ఉ॥ అనుజులు భార్య పిల్లలను, అన్నలు చుట్టము లాదియైన వా
రనుపమ మిత్ర భావమున యాస్తి హరింపగ జేరవత్తురా
అనువగు సంపదల్ దరిగినప్పు డెవండును రాడుగాన నిన్
మనమున నెంచువాడె పరధామముజేరును చెన్నకేశవా! 37

చం॥ ఘనమగు పాము బట్టుకొని, గ్రక్కున మ్రింగుచునుండ యీగలన్
కనితినినేగు కప్పగతి కాయము నిత్యమటంచు నమ్మకన్
మనమును నీ పయిన్నిలిపి మానక నిన్ను భజించు మానవుం
డనుపమలీల దైవపద మారయజేరును చెన్నకేశవా! 38

చం॥ సారవిహీన మీజనన సంద్రము మానవుడీది యీది, వే
సారియు జన్మబంధముల చచ్చుచు, బుట్టుచు మాటిమాటికిన్
క్రూరతరంబు లౌయముని కోరల నోర్చుచు సౌఖ్యపుంజముల్
చూరలుగాగబొందుటది చోద్యము దైవపురీశ కేశవా! 39

చం॥ నిరుపమ పద్మపత్రమున నీరములంటక యుండురీతి, కు
మ్మర పురుగెల్ల వేళలను మట్టినియంటని భాతి, గచ్చకున్
అరయగ భస్మమంటనటు లన్యములంటని చిత్తమెప్పుడున్
స్థిరముగ నీపయిన్నిలుప తీరునఘంబులు చెన్నకేశవా! 40

చం॥ పరుసము సోక లోహమది భాసురకాంచనమైనయట్లు, శ్రీ
హరిపదమంటి మ్రొక్కగనె, యన్ని భవంబులు బాసి నిత్య మౌ
పరమపదంబు జిక్కునని పాయక కొల్చిరి మున్నుమౌనులా
కరణిని గొల్చుమానవుల గావుము దైవపురీశ కేశవా! 41

ఉ॥ ఆవులనేక వర్ణ గతులాపయి పాలొకటైన భంగి, యా
తావిగలట్టి స్వర్ణమిల తానదియెన్నియొ భూషలౌగతిన్
నీవిమల స్వరూపమదినెన్ని యొ నాకృతులైనదంచు, ని
న్నమలిన భక్తి గొల్చెదను, అచ్యుత దైవపురీశ కేశవా! 42

చం॥ పరుసములాడకన్ పరులభార్యల దిట్టక, దుష్టచిత్తులై
తిరుగక సాధుమానవుల దిట్టక కొట్టక సర్వవేళలన్
స్థిరముగ నిన్ను నిల్పిమది తేకువగొల్చిన భక్తకోటికిన్
తరుగని మోక్షమిచ్చెదవు దైవపురీహరి చెన్నకేశవా! 43

చం॥ ఇల్లను బావిలోన బడి ఏదరిగానక మానవుండు తా
తల్లడమందుచున్ మదిన తల్లివి తండ్రివి నీవేయంచు,నీ
వెల్లజగాల బ్రోతువని యెన్నగనీసరి వేల్పు శూన్యమం
చెల్లవిధాల గొల్చెదరు శీఘ్రము భక్తులు చెన్నకేశవా! 44

ఉ॥ రవి తను తూర్పునన్ వెలుగ, రాజితపావక చంద్ర తేజముల్
భువిని నశించు రీతిగను పొల్పగునీచరణా రవిందముల్
ప్రవిమల మానసాంబు నిధి పాయక నమ్మి భజించు మానవుం
డవిరళ సౌఖ్యసంపదల నంది తరించును చెన్నకేశవా! 45

ఉ॥ మిత్రులమంచు దేవతలు, మేదిని గొల్చి తరించుచుండగా
శత్రుల మంచు రక్కసులు సంగర మందెదిరించి చావగా
మిత్రులు శత్రులందరకమేయ తరంబగు మోక్షమిచ్చితౌ
చిత్రము నీ చరిత్ర సరసీరుహలోచన చెన్నకేశవా! 46

ఉ॥ ఊడుగ విత్తు చెట్టునకు నొయ్యన యంటినరీతి గన్నదుల్
వీడకవార్థిజేరుగతి వేగకులాంగన భర్త సన్నిధిన్
కూడిన రీతి, పుష్పలత కోరి మహీజము నెక్కినట్లు నిన్
కూడి తరింత్రు భక్తతతి, గోపకుమారుడ చెన్నకేశవా! 47

## భక్తి సంబంధ పద్యములు

ఉ॥ చేసిన పాపముల్ మరల జేయక నిన్నుతి భక్తిశ్రద్ధలన్
దోసిలి యొగ్గివేడెదను, దోసము లెంచక తోయజాక్షనన్
దాసుని గావు ప్రత్యహము దార కృపారస వీక్షణాలనో
భాసుర రూపకాంతి, ప్రతిభాన్విత మాధవ చెన్నకేశవా! 48

ఉ॥ విన్నమాలకించునిను వేయి విధాల నుతింతు నింకనీ
సన్నుతిజేసి భక్తతతి సాగిలమ్రొక్కియు చిత్తవీధి, నీ
న్నెన్నియు గొల్చు చుండెదరు విశ్వమయా సదయాంతరంగ, యా
పన్న శరణ్యుడంచు భవబంధవిమోచన చెన్నకేశవా! 49

ఉ॥ దానవ సంహరుండ! రణదర్పిత శూరహరుండ మాధవా!
దీనదయాసముద్ర! జగదేక విరాట్ పురుషావతార! మ
న్మానస పద్మ భృంగ! పరమాత్మనమోన్నమ దివ్యరూపనిన్
కానగజేసి నాయఘము - గ్రక్కున బాపుము చెన్నకేశవా! 50

ఉ॥ పాపుల స్నేహమున్నెరపి పాపములెన్నొ యొనర్చు చుండి, యా
లాపములాడుచున్ కడువిలాసత ఘోరము లెన్నొజేసి, నీ
దాపుకు జేరినీమమున ధ్యానమొనర్చెడి వారి పాపముల్
బాపియు మోక్షమిచ్చెదవు భాసురదైవపురీశ కేశవా! 51

ఉ॥ వాసవురీతి రాజ్యసుఖ వార్నిధిదేలి అఖండ భూములం
దాసను వీడలేక కనకాద్రి సమాన ధనాలబొందినన్
కాసును వెంటరాదు కనికానక చేసిన పాపపుణ్యముల్
వాసిగ వెంబడిందగులు భాసుర దైవపురీశ కేశవా! 52

చం॥ పరమ పవిత్ర నీ కథలు పాయక నేను పఠింతు శ్రద్ధతో
సురుచిర రూపవైభము చూచినుతింతు త్వదీయ మంత్రముల్
కరము జపించి భక్తికలకాలముజేసెద నీదు పూజలన్
మరువ ధరాత్మజారమణ మాధవ దైపురీశ కేశవా! 53

చం॥ గజమును యావిభీషణుని కాకమునాగుహునిన్ కుచేలునిన్
నిజముగ కుబ్జనావిదురు, నేర్పున ఉత్తరు నాయహల్యనున్
గజిబిజి లేక బ్రోచినటు గ్రక్కున నన్దయగావుమయ్య, యో
సుజన మునీంద్ర, యోగి జనసన్నుత దైవపురీశ కేశవా! 54

ఉ॥ కోరిభజించి నిన్ను కడు కూర్మినివేడ ధ్రువుండగాను దై
త్యారి జనార్ధనాయనుచు తావక పాదయుగంబు గొల్వ, న
క్రూరుడగాను, దీనుడను కృష్ణముకుందయటంచు నిన్ను, నే
మారక గొల్వ శక్తినిడు మాధవ దైపురీశ కేశవా! 55

ఉ॥ ఇలను విభీషణాదుల కహీన సుఖంబులనందజేసి, నిన్
దలచిన భక్తుడా ధ్రువు నుదారత బ్రోచియు రాజ్యమిచ్చి, యా
ఫలములనీయగా శబరి - భక్షణజేసి కుచేలుకెన్నగా
కలిమిడినావు, నీ కృప యగాధము దైవపురీశ కేశవా! 56

ఉ॥ గౌతము భార్యనున్ కరుణగాచిన రీతిన, స్త్రీజనంబులన్
భూతలమందు బ్రోవగను పోడిమి దైవపురాంతరంబునన్
ప్రీతిన మాధవాంశమున పెంపల రంగను పూజలందుచున్
పూత చరిత్ర నిల్పితివ పూర్వపురీతిన చెన్నకేశవా! 57

ఉ॥ మానవరక్షకా! ధనుజమారణ! శ్రీరమణీమనోహరా!
దీనదయా సముద్ర! పరిదీపిత దివ్యతురంగ! నిన్ననే
మానసమందు గొల్తు పరమాత్మ నిరంజన చిద్విలాస నిన్
పూని భజించు భక్త తతిబ్రోవుము దైవపురీశ కేశవా! 58

చం॥ వలదు చలంబు భక్తులను వారిజనేత్రుడ ప్రోవుమయ్య, నీ
విలసిత భవ్య విగ్రహ విభూషిత దివ్య పదాల గొల్తున
న్నలనట బెట్టగా దగదు ఆర్తజనావన పాపనాశ నిన్
తలచినుతింప నాతరమె దైవపురీహరి చెన్నకేశవా! 59

ఉ॥ ఇత్తువు కోర్కెలీవనుచు వేడిస్తుతించెడి వారి కోర్కె గ
మ్మత్తుగ దీర్చునట్టి పరమాత్ముడ వౌటను భక్తకోటినిన్
దత్తత గొల్చుచుండెదరు దైవపరీహరి వారినేరముల్
మొత్తము బాపి సత్వరము మోక్షమొసంగుము చెన్నకేశవా! 60

ఉ॥ తల్లియుదండ్రి నీవనుచు దైవమ! మానక చిత్తవీధి, నీ
సల్లలితోరు పాద జలజమ్ముల నిల్పియు భక్తులెల్ల, యో
హల్లకనేత్ర! కంసహర ఆర్తశరణ్యుడ దానవారినిన్
నల్లని మేనివాడ యని నమ్మిభజింతురు చెన్నకేశవా! 61

ఉ॥ రార కృపాకరా! వినర రమ్యగుణాకర! దివ్యసుందరా
కారరమావినోద! రిపుగర్వ విభంజన దంతి రక్ష! రా
రారవి తేజ నాపయిన రమ్యకృపారసమొల్కజేయుమో
శ్రీరమణీమణీశ హరి! చిత్ర విలాసుడ చెన్నకేశవా!1 62

ఉ॥ దివ్యతరంబులున్ భువన దీపకముల్, కనవేద వేద్యముల్
భవ్యకరంబులున్, పతిత పావనముల్, భవదంఘ్రి పద్మముల్
నవ్యములంచు నెంచిమది నమ్మిస్మరించెడి మానవాళికిన్!
అవ్యయ మోక్ష సంపద లఖండ సుఖంబిడు చెన్నకేశవా! 63

ఉ॥ కోరియు సర్వదేవతలు గొల్వగ లక్ష్మికి ప్రక్కజేరి, మం
దారవనాన చంద్రమణి దీపిత దివ్య వితర్ధిపైన, నీ
వారయ శేష తల్పమున యంబు జనాభ వరుండియుండి, శృం
గార కళాస్వరూపమున గాతువు భక్తుల చెన్నకేశవా! 64

చం॥ సురనుత చక్రధారి! పురుషోత్తమ రుక్మిణి ప్రాణవల్లభా
నరసఖ కంస సంహరణ నందక హస్త వినీల గాత్ర, యో
వరమదయానిధే పతిత పావన యంచు స్మరించువారికిన్
తరుగని మోక్ష మిచ్చెదవు దైవపురీహరి చెన్నకేశవా! 65

ఉ॥ నీకు కుమారుడై నలువ నేర్పున సృష్టినిజేసె జీవులన్
నీకును భార్యయైన సిరి, నిత్యము సంపదలిచ్చు వేడినన్!
నీకుని బుట్టిపాదముల నిర్మలత్న్ జరియించె గంగ, యో
శ్రీకరుణా సముద్ర సరసీరుహలోచన చెన్నకేశవా! 66

ఉ॥ జగమును బెంచకర్తవయి సాధులబ్రోచెడి కల్పవృక్షమై
గగనము సర్వదేవతలు కాయము నందలరార వింతగన్
త్రిగుణములన్నిరూపమరి తేజమునిండిన జ్ఞానివంచు, నీ
నిగమస్వరూపముందలతు నేర్పుగ దైవపురీశ కేశవా! 67

ఉ॥ భూతములన్ సృజించెదవు పొల్పమరంగ చతుర్ముఖాకృతిన్
ప్రీతిగగాతు విష్ణువయి, వేగహరింతువు ఈశ్వరాఖ్య, న
జ్ఞాత భవుండ వంచెఱిగి, బ్రాతిగ గొల్చెడి భక్త బృందముల్
చేతులు మోడ్చి నీస్తవము జేతురు దైవ పురీశకేశవా! 68

చం॥ అరయగ నాభిపద్మమున నాయజు బెంచియు వానిమోమునం
దరయగ శంకరున్నిలిపి యాసురగంగ మహేశు నెత్తిపై
తిరముగ నుంచి యానదిన దివ్యపదమ్ముల జేర్చినట్టి, నీ
సరిగల వేలుపెవ్వరిక శార్ఙ్గధరా హరి చెన్నకేశవా! 69

చం॥ సలిలిత నీదునామమును సన్నుతిజేసెడి మర్త్యకోటికిన్
తొలగు సమస్తదోషములు తోయ రుహానన పుర్వులగ్ని పై
నిలిచి చలింపలేవుగద! నీరజనాభత్వదీయ రూపమున్
తలచి నుతింపగా తరమె దైవపురీహరి చెన్నకేశవా! 70

చం॥ అభ్రమునందు మేఘములు అంతటనిండి చరించి పట్టునన్
శుభ్రపు వాయు తాకిడికి చోద్యముగన్ పరవెత్తు రీతిగన్
విభ్రమ పాపపుంజములు వింతగ బాయును నీదుచింత, చే
అభ్రగవాహ సత్యమిది అత్యుత దైవపురీశ కేశవా! 71

ఉ॥ పాపము దొల్గజేయగను భానుసుదగ్రపు దివ్యబింబమై
దీపితమొందు నీతనువు, దేవ! మహోరగ జన్మ బంధముల్
బాపగగారు డాస్త్రమని భక్తి జపించెద నీదుమంత్ర మిం
పారగనామనంబునను భాసురదైవ పురీశ కేశవా! 72

ఉ॥ పనిగొని సర్వతీర్థముల పల్మరు గొల్వ ఫలంబు లేదు, తా
ననిశము మౌన ముద్రగొని ఆగము ఋక్కులు వేదమంత్రముల్
ఘనత పఠింపకించుకయు గల్గదు మోక్షము ముక్తికాంతకై
మనమున నిన్నె కొవ్వవలె మాధవ దైవ పురీశకేశవా! 73

చం॥ పరుసములాడకుండ ధరపాపములన్ వెసజేయకుండ, తా
నిరతము ప్రాణకోటికిని, నెయ్యడ కీడొనరింపకుండగన్
పరగియు మోద దుఃఖముల భావమునన్ సమదృష్టి జూచినిన్
తిరము స్మరించు భక్తులకు దిక్కయి ప్రోతువు చెన్నకేశవా! 74

చం॥ పరులను తన్ను గుర్తెఱుగు బంధురమౌ పరతత్త్వ జ్ఞానమున్
కరివరయానపై గలుగు కామముద్రోచు నిరీహభావమున్
మరణము గల్గునప్పుడును మానని నీ స్మరణాను రక్తియున్
నరులకొసంగ మ్రొక్కెదను నామది దైవపురీవకేశవా! 75

ఉ॥ వేదములందు ముఖ్యుడగు వేలుపునీవెయటంచు మౌనులున్
శోధనజేసి కొల్చెదరు సూక్ష్మతరంబగు నీదురూపమున్
క్రోధము వీడి మ్రొక్కగను కోయని పల్కెదు భక్తరక్ష, యో
శ్రీదసమస్త లోకపరిసేవిత శ్రీహరి చెన్నకశవా! 76

ఉ॥ సతులును పుత్రులున్ ధనము సర్వము శూన్యమటంచు చిత్తమం
దతను జయించి యింద్రియములన్నియు బంధనజేసి కోర్కెలన్
సతతము ద్రుంచి నీదుపదసారసయుగ్మము నాశ్రయించి, సం
స్తుతులొనలరించు భక్తులను చొప్పడ బ్రోవుము చెన్నకేశవా! 77

చం॥ ప్రమదము తోడ నర్థిజన భావమెఱింగి దయాగుణంబుతో
క్రమముగ గ్రామముల్ మరియు కాంచనమాది సమస్త దానముల్
తమకము మీరగన్ జలిపి తావక దివ్య పదారవిందముల్
అమలిన భక్తి గొల్చు నరుడందును మోక్షము చెన్నకేశవా! 78

చం॥ కులమును రూపమెంచకను గోత్రము పేరు తలంచకుండగన్
బలయుతజ్ఞాన ఖడ్గమున బాహులద్రుంచియు క్రోధమున్ వెసన్
పొలయగ జేసి, యూర్ములను పూనియణంచియు మోక్షకాంతకై
కొలచిరి యోగులెల్లనిను కోరుచు దైవపురీశ కేశవా! 79

ఉ॥ యవ్వనమందు కామమును ఆపయి వృద్ధతనాన రోగముల్
చయ్యన బాధలుం గలుగ చాలభవంబులు బొంది నీ యెడన్
నొయ్యన నీదు సంస్మరణ నోపిక జేసి తరించువాడనో
అయ్యవరాత్పరా అఘములన్నియు బాపుము చెన్నకేశవా! 80

ఉ॥ సమ్మదమైన యాచరణ, సత్యము, సూనృత శౌచ శీలముల్
ఇమ్మహి భక్తి తత్త్వము అహీన కృపాకర చిత్తశుద్ధి, శాం
తమ్మను ధైర్య ధర్మములు, తాలిమి జీవహితమ్ముగల్గు, ని
న్నిమ్ముల గొల్చు భక్తులకు యేర్పడ దైవపురీశ కేశవా! 81

చం॥ ఘనమగు నీదు రూపమును గ్రక్కున జూడనివాడు అంధుడౌ
వనజదళాక్ష నీ స్మరణ పన్నుగ కర్ణము జొన్పకున్న నా
చనటి యే మూగ యౌననుచు చెప్పుదు రార్యులు, గానయింకనిన్
ఘనతదలంచు మానవుల గావుము దైవపురీశ కేశవా! 82

చం॥ చేసి యనేక పాపముల చేసియు నెన్నియొ దుష్టకార్యముల్
చూసియు వృద్ధమానవుల చుల్కన జేసి హసించి యావలన్
రోసము బూని సజ్జనుల రోసియు తిట్టినయట్టి వారలన్
వాసిగనిన్ దలంచగనె వారకగాతువు చెన్నకేశవా! 83

ఉ॥ సాలెపురుంగు గర్భమున సాగిన నూలది యంత మౌనటుల్
నేలన సర్వ వృక్షములు నేర్పున బుట్టి కృశించురీతి, భూ
తాళియు నీదు గర్భమున తప్పక బుట్టియు గిట్టెచుండు నో
నీలశుభాంగ నీ మహిమ లెన్ననసాధ్యము చెన్నకేశవా! 84

ఉ॥ చక్కని వాడవంచు గుణసంపద చాల గలాడవంచు నీ
ప్రక్కకు జేరు భక్తతతి పాపము బాపుచు నుండి దీనులన్
మిక్కిలి బ్రోచు వాడనుచు మేదిని నిన్ను దలంచి మ్రొక్కగా
చిక్కులు దీర్చికాతువట శీఘ్రము దైవపురీశ కేశవా! 85

ఉ॥ నీ సతి యిచ్చు సంపదలు నీసుతుడిచ్చు శుభాలు కొల్లగా
నీసుత జేయు పావనము నీవు జగాలను బ్రోతువెప్పుడున్
నీసరిదేవతల్ గలరె నిన్ను భజించిన వారికెల్లా, నా
యాసములంటకన్ భువిని యార్తి దొలంగును చెన్నకేశవా! 86

ఉ॥ గర్భమునందజాండమును గ్రక్కున నిల్పియు ప్రాటికోటికిన్
నిర్భర రక్షణమ్మిడుచు నేర్పున సర్వచరాచరాల, సం
దర్భము జూచి కాచెదవు ధాత్రిన గొల్చెడి మానవాళికిన్
దుర్భర పాపముల్ దునిమి దుఃఖము బాపుచు చెన్నకేశవా! 87

ఉ॥ పెంచగ కర్తవై పుడమి భీకరపాపము ద్రుంచ తండ్రివై
సంచితమైన రోగముల సర్వము బాపగ వెజ్జువై తగన్
మించినజాండ ఖాండముల మేదిని రక్షణ జేయునట్టి, ని
న్నెన్ని నుతించు మానవుల వేమరు గాతువు చెన్నకేశవా! 88

ఉ॥ పాపములెన్నొ జేసితిని పన్నగశాయి మదీయ దోషముల్
బాపగనీదు నామమును పల్మరు సంస్తుతి జేయనెంచి, నీ
ప్రాపుకు జేరినాడ నిక భక్త జనావన! సాధురక్ష, సం
తాపము బాపి మోక్షమిడు దైవపురీ హరిచెన్నకేశవా! 89

ఉ॥ సిరికిని కన్నుదామరలు చిత్రముగన్ వెలుగొండ నామెకున్
మురిపెముదీర శ్రావ్యమగు ముచ్చటజెప్పుచు విష్ణులోకమం
దరయగ శేషపాన్పు పయి నచ్యుత భక్తులు నిన్నుగొల్చు, సుం
దరతర రూపవైభవము ధాత్రి నుతించెద చెన్నకేశవా! 90

చం॥ ముదమునవాటపట్టగుచు మొహలతన్ దెగ్గటార్చు ఖడ్గమై
కొదవలు లేని సంపదిడి కోర్కెల నెల్లనుదీర్చునట్టి, నీ
సదమల మంత్ర రాజమును సన్నుతిజేతు కృపాంతరంగ, నీ
పదములు గొల్చి మ్రొక్కెదను పాపవినాశక చెన్నకేశవా! 91



చం॥ మనుజుడనేక పాపముల మానకజేసి యుఘోర కృత్యముల్
అనుదినమెన్నొ చేసి పరమాత్మ! పరాత్పర దీనరక్షకా!
తునిమి మదీయ పాపముల దుర్గతిబాపియు కావుమన్న, యో
ధనుజ వినాశకాచెదవు దైవపురీహరి చెన్నకేశవా! 92

చం॥ మురహర! యో రమారమణ! మొహవినాశక భక్తపాల! నీ
సురచిర సుందరాననపుశోభలనెంచి త్వదీయ నామమున్
మరవక సంస్తుంతునిను మాధవ భక్తుల జన్మబంధముల్
సరగున ద్రెంచి మోక్షమిడు సారసలోచన చెన్నకేశవా! 93

చం॥ పలుకవిదేలనో పరమపావన నామ! వినీలగాత్రనిన్
దలవని రోజు లేదు గద తావకదివ్యమనోహరాకృతిన్
పలుమరు గాంచి కొలిచెదము పద్మదళాక్షుడ! దంతిరక్షనిన్
కొలిచి జపించు మానవుల కోర్కెలు దీర్చుము చెన్నకేవవా! 94

ఉ॥ చంద్ర నిభాననా! విమలసారసనేత్ర! కృపాంతరంగ! మౌ
నీంద్రనుతాలవాల! కమనీయ త్వదీయ పదాంఘ్రి సేవలన్
సాంద్రత గొల్చి ఘోరభవసాగరమున్ తరియింప స్వామి, నేత్
చంద్రిక లీను నీదు ముఖసారసమున్గని చెన్నకేశవా! 95

ఉ॥ పుట్టుక లెన్ని యెత్తితినొ భూరికృపామయనీదురూపమిం
కెట్టులగాంతునో ఎరుగ యేగతి పూజలొనర్చ జన్మముల్
గట్టుకు జేర్తువో పరమకారుణికోత్తమ చక్రపాణి, యీ
పట్టుననన్ను నీదయకు పాత్రునిజేయుము చెన్నకేశవా! 96

ఉ॥ చేసి యనేక పాపములు శీఘ్రము దూషణజేసి పెద్దలన్
కాసిలజేసి భక్తులను కావుమటంచును వేడినంత సం
త్రాసము బొందజేయకను, తప్పుల నెంచక నీదయారసో
ల్లాసము వారిపై బరపి రక్షణజేయుము చెన్నకేశవా! 97

చం॥ స్థిరకరుణాబ్ధి దేల్చినను శీఘ్రము గావగ వేడుచుంటి దు
స్తరమగు జన్మసాగరము చయ్యవనీదగ జేసి యోదయా
కర! హరి మోహపాశమును గ్రక్కున బాపి మదీయ మానసం
బరసియు నన్ను గావుమయ ఆర్తజనావన చెన్నకేశవా! 98

చం॥ జాలము జేయనేల! యిక చాలును మాపయి కోపమేల! నీ
జాలి యొకింత జూపిమము, సర్వవిధంబుల రక్షజేసి, మా
పాలిట కల్ప వృక్షమయి పాపము బాపి సమస్త దోషముల్
దూలగజేసి పూజగొను తోయరుహానన చెన్నకేశవా! 99

ఉ॥ మిన్నక యుంటివేల పరమేశ పరాత్పర! నీడునామమున్
సన్నుతి జేయు మౌనులకు చక్కగ మోక్ష మొసంగినావు, మా
విన్నప మాలకించుమని వేయివిధంబుల మ్రొక్కచుంటిమో
పన్నగహార, సచ్చరిత! పాపవినాశక చెన్నకేశవా! 100

ఉ॥ శోకవినాశ నీదు పరిశోభిత నిర్మల మూర్తియందు, ని
ష్టైక విలోకనక్రమము-దప్పగనీకనుతించు మానవుల్
రాకడపోకడల్ గల దురంత జరామారణాది దుఃఖముల్
సోకుట లేని నీమరుగు జొచ్చి సుఖంతురు చెన్నకేశవా! 101

ఉ॥ భావజ శత్రుమిత్ర! భవబంధ వియోచన సచ్చరిత్ర! సం
భావిత భవ్యగాత్ర! నవపద్మ విరాజిత దివ్యనేత్ర! దం
తావళ కీర్తిపాత్ర! ఘనతామర సాక్ష! రమాకళత్ర! ప్రా
భావపు పాపపుంజముల బాపుము శ్రీహరి చెన్నకేశవా! 102

ఉ॥ పూనిక నేర్చి కూర్చితిని పూర్తిగ నుత్పల చంపకంబులన్
మానిత పుణ్య, నాదు సుమమాల ధరించియు ముక్తి నీయవే
దీనదయాసముద్ర జగతీధవ శ్రీహరి చిన్నికృష్ణ, యో
మానిత పుణ్య నిన్గొలుతు మాధవ దైవపురీశ కేశవా! 103

ఉ॥ భూతలమంద యోధ్య పురి పొల్పుగబుట్టియురామునాకృతిన్
బ్రాతిగ శేషపాన్పు నిలభ్రాతగ జేసి త్వదీయ చక్రమున్
ఆతత శక్తియుక్తుడగు అంజన పుత్రుగ తీర్చిదిద్ది తో
శ్రీ తరుణీనివాస సరసీజ విలోచన చెన్నకేశవా! 104

అడుగుల వంశ వార్నిధిన అమృతనందము కోటిశాంబకున్
పుడమి జనించి, నీదుపద పూజలొనర్చి, శతాధికంబుగా
నుడివియు పద్యపుష్పముల ఉత్సుకతన్ యిడి తంకితంబుగా
కడపక దీనిగైకొనియు కావుము దైవపురీశకేశవా! 105

రామయ నామధేయుడ - పరాత్పరనిన్ గొనియాడు వేడుకన్
కోమల వృత్త పద్యముల కూర్చితినెన్నో పురాణ గాధలన్
ఈమహి దీనిభక్తి పఠియించిన భక్తుల దీక్ష నేలుమో
శ్రీమహిళా మహేశ! సరసీరుహలోచన! చెన్నకేశవా! 106

శ్రీధర నీకు మంగళము చిన్మయ రూప రమాకళత్ర, నీ
రాధకు సత్యభామలకు, రమ్యసుమంగళమోను చక్రకౌ
మోదకి నందకాదులకు ముందుగ మంగళమౌ జనార్ధనా
మాధవ చిద్విలాస పరమాత్ముడ దైవపురీశ కేశవా! 107

| | | | |
|---|---|---|---|
| 1. | రావి అంజనేయులు | దైవాలరావూరు | 15,000 |
| 2. | రావి వెంకటశేషయ్య | దైవాలరావూరు | 15,000 |
| 3. | పట్టా కృష్ణమూర్తి | దైవాలరావూరు | 10,000 |
| 4. | వజ్జ శ్రీనివాసరావు | దైవాలరావూరు | 10,000 |
| 5 | రాచమల్లు చినవెంకటేశ్వర్లు | దైవాలరావూరు | 10,000 |
| 6 | వృద్దినేని రాఘవయ్య | | 10,000 |
| 7 | జాగర్లమూడి రాఘవరావు | | 5,000 |
| 8. | కె నరసింహులు | హైదరాబాద్ | 5001 |
| 9 | పనవన్ పెర్టిలైజర్స్ | బళ్ళారి | 5116 |
| 10 | యన్ భూపతిరావు | విజయవాడ | 5000 |
| 11 | కొవి సుబ్బాయమ్మ | దైవాలరావూరు | 5001 |
| 12. | రాచమల్లుచిన వెంకటేశ్వర్లు | | 5116 |
| 13 | దేహ రాధాకృష్ణమూర్తి | | 5116 |
| 14 | రావి వెంకటేశ్వర్లు పోతురాజు | | 5116 |
| 15. | కొల్లి పుల్లారెడ్డి | | 5001 |
| 16 | రావిపాటి అంజమ్మ హనుమయ్య | | 5001 |
| 17. | రావిపాటి గోవిందమ్మ | | 5001 |
| 18 | ముప్వ రామయ్య | | 5001 |
| 19 | గుండవనేని ఓబయ్య | | 5001 |
| 20. | కీ.శే రావిపాటి శ్రీరాములు, రంగయ్య | | 5516 |
| 21. | రావిపాటి చిన వెంకటసుబ్బయ్య | | 5001 |
| 22. | బెజవాడ వెంకట సుబ్బయ్య | | 5001 |
| 23 | రావి రంగనాయకులు | | 5001 |
| 24. | పాతూరి సుబ్బారావు | | 5001 |
| 25. | పావులూరి వెంకట సుబ్బయ్య | | 5001 |
| 26 | పాపోలు సుబ్బారావు | తక్కెళ్ళపాడు | 5116 |
| 27. | యన్. నాగరత్నమ్మ వీరబాబు | రావినూతల | 5001 |
| 28. | రామాయంజేయులు ఆయిల్‌ప్రాడక్ట్ | అద్దంకి | 5116 |
| 29 | ధూళిపాళ హరిబాబు | హైదరాబాదు | 5116 |
| 30 | ఎస్.ఎ వి. సురేఖా ఫైనాన్స్ | హైదరాబాదు | 5116 |
| 31. | దేను సూర్యనారాయణ | దైవాలరావూరు | 4000 |
| 32. | బొమ్మరాజు మంగమ్మ | బి. నిడమానూరు | 4000 |
| 33. | పింగళి పాండురంగారావు | ఒంగోలు | 3000 |
| 34. | యడవల్లి వెంకట సుబ్బయ్య | దైవాలరావూరు | 2516 |
| 35. | రావిపాటి సత్యనారాయణ | దైవాలరావూరు | 2,500 |
| 36. | పాతూరి లక్ష్మీకాంతారావు | | 2116 |
| 37. | మద్దినేని సుబ్బారావు పేరయ్య | దైవాలరావూరు | 2000 |
| 38. | లింగా సౌభాగ్యమ్మ సుబ్బయ్య | దైవాలరావూరు | 2500 |
| 39. | జంపు అంజనేయలు | దైవాలరావూరు | 2100 |
| 40. | దేను నాగేశ్వరరావు | దైవాలరావూరు | 2000 |
| 41. | దేను పుల్లారావు | దైవాలరావూరు | 2000 |
| 42. | జొన్నలగడ్డ పేరయ్య | దైవాలరావూరు | 2000 |
| 43. | మద్దినేని వెంకటస్వామి | దైవాలరావూరు | 2116 |
| 44. | తొటెంపూడి అంజేయులు | దైవాలరావూరు | 2500 |
| 45. | మద్దినేని హనుమయ్య | దైవాలరావూరు | 2000 |
| 46. | తానిపర్తి సుబ్బారెడ్డి | దైవాలరావూరు | 2116 |
| 47. | వుమ్మనేని వెంకటేశ్వర్లు | దైవాలరావూరు | 1500 |
| 48. | మద్దినేని నరసింహారావు | దైవాలరావూరు | 1500 |
| 49. | యవమాను అంజనేయులు | బొల్లవరప్పాడు | 1516 |
| 50. | మట్టుపల్లి నాగేశ్వరరావు | అద్దంకి | 2116 |
| 51. | సత్యనారాయణ బాయిల్డ్ రైస్‌మిల్ | | 2100 |
| 52. | చిగురుపాటి సుబ్బారావు | దుద్దుకూరు | 2116 |
| 53 | బాలాజీ బాయిల్డ్ రైస్‌మిల్ | గుంటూరు | 2116 |
| 54 | జి. పూర్ణచంద్రరావు | కాకుమాను | 2116 |
| 55. | శ్రీ కోటేశ్వర ఫిల్లింగ్‌స్టేషన్ | గుంటూరు | 1116 |
| 56. | రాఘవేంద్ర బాయిల్డ్ రైస్‌మిల్ | గుంటూరు | 2116 |
| 57. | శ్రీరామరావు బాయిల్డ్‌రైస్‌మిల్ | గుంటూరు | 501 |
| 58. | వుషశ్రీ ఫైనాన్స్ | గుంటూరు | 1001 |
| 59. | ముమ్మన పెద్దన | దైవాలరావూరు | 1516 |
| 60 | సూర్యచంద్ర ఆయిల్‌ఫెడగ్రామ్ | అద్దంకి | 1116 |
| 61. | శ్రీ బాలాజీ ఎంటర్ ప్రైజస్ | | 1116 |
| 62. | చిన్నం బుల్లయ్య జ్ఞాపకార్థం | | 5116 |
| 63 | పోలిశెట్టి హరిప్రసాద్ | గుంటూరు | 1116 |
| 64 | కల్లూరి స్వాములు | ముప్పాళ్ళ | 1116 |
| 65 | ఆదినారాయణ | ముప్పాళ్ళ | 1116 |
| 66. | పాతూరి వెంకటేశ్వరావు | | 1614 |
| 67. | రావి హనుమంతరావు | ఒంగోలు | 1116 |
| 68. | ముమ్మన వెంకటేశ్వరావు జ్ఞాపకార్థము | | 1116 |
| 69. | రావిపాటి పెద్ద వెంకటసుబ్బయ్య | | 1116 |
| 70. | జ్యోతి డైయిరి | దేశాంగివరం | 9001 |
| 71. | దైవాలరావూరు రజక సంఘం | దైవాలరావూరు | 2616 |
| 72. | ముమ్మన వెంకటేశ్వర్వర్లు | దైవాలరావూరు | 1516 |
| 73. | దేను రామబ్రహ్మం | దైవాలరావూరు | 1500 |
| 74. | హెరిటేజ్‌పుడ్స్ (ప్రై)లి | బి మంజులూరు | 1500 |
| 75. | కోమటిగుంట పెదకేశవులు | | 2516 |
| 76. | కీ.శే. నాతాని జలయ్య | దైవాలరావూరు | 1016 |
| 77. | దేను అంజనేయులు | దైవాలరావూరు | 1116 |
| 78. | పాతూరి హనుమయ్య | దైవాలరావూరు | 1116 |
| 79. | తానిపర్తి కోటిరెడ్డి | దైవాలరావూరు | 1116 |
| 80. | పొట్టికాశీవిశ్వనాథం | దైవాలరావూరు | 1116 |
| 81. | వడ్లవల్లి ప్రసాదరావు | దైవాలరావూరు | 1116 |
| 82. | నాతాని హనుమయ్య | దైవాలరావూరు | 1116 |
| 83. | నాతాని సామ్రాజ్యం | దైవాలరావూరు | 1116 |
| 84. | లింగా బసవయ్య | దైవాలరావూరు | 1116 |
| 85. | లింగా వెంకటేశ్వర్లు | దైవాలరావూరు | 1116 |
| 86. | లింగా సుబ్బయ్య | దైవాలరావూరు | 1116 |
| 87. | మద్దన రామకృష్ణయ్య | దైవాలరావూరు | 1116 |
| 88. | గొట్టిపాటి వీరయ్య | దైవాలరావూరు | 1116 |
| 89. | దేను సుబ్బారావు | దైవాలరావూరు | 1116 |
| 90. | కట్టా శింగయ్య | ఒంగోలు | 2116 |
| 91. | బత్తిన నరసింహారావు | ఒంగోలు | 1116 |
| 92. | జాగర్లమూడి వెంకటరావు | | 1016 |
| 93. | యూనియన్‌బ్యాంక్‌స్టాఫ్ | జాగర్లమూడిపాలెం | 1011 |
| 94. | కోవి అంజనేయులు | తాటివారిపాలెం | 2116 |
| 95. | మండూరి సుబ్రహ్మణ్యం | | 1116 |
| 96. | యడవల్లి పూర్ణానందం | దైవాలరావూరు | 1116 |

| | | |
|---|---|---|
| 97. ముమ్మన నరసింహారావు | దైవాలరావూరు | 1116 |
| 98 లింగా పెద హనుమంతరావు | దైవాలరావూరు | 1116 |
| 99 రావిపాటి సుబ్బారావు | దైవాలరావూరు | 1116 |
| 100.కారుసాల శ్రీనివాసరావు | | 1116 |
| 101 మేడెంపూడి వీరాంజనేయులు | దైవాలరావూరు | 1116 |
| 102.ముమ్మన వెంకటసుబ్బయ్య | దైవాలరావూరు | 1116 |
| 103 దేసు వెంకయ్య | దైవాలరావూరు | 1116 |
| 104 కారుసాల శ్రీనివాసరావు | రావినుతల | 116 |
| 105 మేడెంపూడి వీరాంజనేయులు | దైవాలరావూరు | 116 |
| 106 ముమ్మ వెంకట సుబ్బారావు | దైవాలరావూరు | 116 |
| 107. దేసు వెంకయ్య - శ్రీనివాసరావు | దేవాలరావూరు | 116 |
| 108. శిఖాకొల్లి ప్రసాద్ | ఒంగోలు | 1016 |
| 109. కారాసాల శింగయ్య చౌదరి | రావినూతల | 100 |
| 110 గరిటా వెంకటేశ్వర్లు( మా స'ర్పంచ్) | రావినూతల | 100 |
| 111. తోటెంపూడి వెంకట సుబ్బయ్య | రావినూతల | 100 |
| 112 వూటు కూరి రామ కోటేశ్వరరావు | అద్దంకి | 1116 |
| 113 వెలనాటి నాగార్జున రావు | అద్దంకి | 1116 |
| 114 కె వి సుబ్బారావు | అద్దంకి | 1116 |
| 115 గోరంట్ల బ్రహ్మనాయుడు | అద్దంకి | 2116 |
| 116. నాదెండ్ల దశరధ రామయ్య | అద్దంకి | 2116 |
| 117. డా కరణం రవీంద్రబాబు | అద్దంకి | 2000 |
| 118. విక్రం వెంకట స్వామి | పమిడిపాడు | 1000 |
| 119. మామిళ్ళపల్లి రాఘవులు | పమిడిపాడు | 1000 |
| 120 పాలేరు వీరాస్వామి | రాచపూరి | 1116 |
| 121. అంజని ఫైనాన్స్‌కార్పోరేషన్ | అద్దంకి | 2116 |
| 122 గుండ పనేని సుబ్బారాయుడు | దైవాలరావూరు | 1116 |
| 123. కంది మళ్ళ ప్రకృచంద్ | దైవాలరావూరు | 1116 |
| 124. చంద్రి రాజేంద్రప్రసాద్ | కావూరివారిపాలెం | 1116 |
| 125 తలపనేని సుబ్బారావు | జానకివరం | 516 |
| 126. మక్కెన శ్రీనివాసరావు | మక్కేనవారిపాలెం | 1116 |
| 127. కరి ఆంజనేయులు | గంగవరం | 1116 |
| 128. ముమ్మన రామయ్య | దైవాలరావూరు | 1116 |
| 129. పోలినేని జానకిరామయ్య | దైవాలరావూరు | 1116 |
| 130. బాచిన సుబ్బయ్య | దైవాలరావూరు | 1116 |
| 131. తానికొండ కోటయ్య | దైవాలరావూరు | 11116 |
| 132 యార్రగుంట పేరయ్య | దైవాలరావూరు | 1116 |
| 133. మద్దినేని కోటేశ్వరరావు | దైవాలరావూరు | 1116 |
| 134. బొక్కినంభవాని శంకరరావు | దైవాలరావూరు | 1116 |
| 135. రావి ఆవజనేయులు | దైవాలరావూరు | 1116 |
| 136. ముమ్మన సాంబశివరావు | దైవాలరావూరు | 1116 |
| 137 మరాం వీరాంజనేయులు | దైవాలరావూరు | 1116 |
| 138. మేడెంపూడి దశరధ రామయ్య | దైవాలరావూరు | 1116 |
| 139. మేడెంపూడి వెంకటశేషయయ | దైవాలరావూరు | 1116 |
| 140. ముమ్మన హరిబాబు | దైవాలరావూరు | 1116 |
| 141. తోట్టెంపూడి హనుమంతరావు | దైవాలరావూరు | 1116 |
| 142. తోట్టెంపూడి రామనాదం | దైవాలరావూరు | 1116 |
| 143. కరణం శ్రీనివాసరావు | దైవాలరావూరు | 1116 |
| 144. తోటెంపూడి కృష్ణమూర్తి | దైవాలరావూరు | 1116 |
| 145 ముత్తవరపు ఆంజనేయులు | దైవాలరావూరు | 1116 |
| 146 రావి కోటేశ్వరరావు | దైవాలరావూరు | 1116 |
| 147 రావి అంజనేయులు | దైవాలరావూరు | 1116 |
| 148. జొక్కినం పున్నయ్య | దైవాలరావూరు | 1116 |
| 149 ముమ్మన లింగయ్య | దైవాలరావూరు | 1116 |
| 150 కోడూరి సుబ్బయ్య | దైవాలరావూరు | 1116 |
| 151 పాతూరి హనుమంతరావు | దైవాలరావూరు | 1116 |
| 152 ముత్తవరపు గోపపాలకృష్ణమూర్తి | దైవాలరావూరు | 1116 |
| 153. కొల్లి పుల్లారెడ్డి | దైవాలరావూరు | 1116 |
| 154 కనుబొద్దు సుబ్బారెడ్డి | దైవాలరావూరు | 1116 |
| 155 కోనురి శేషయ్య | దైవాలరావూరు | 1116 |
| 156 రావిపాటి రామయ్య | దైవాలరావూరు | 1116 |
| 157 మద్దినేని శ్రీనివాసరావు | దైవాలరావూరు | 1116 |
| 158. సి హెచ్ ధనుంజయరావు | దైవాలరావూరు | 2116 |
| 159 జంటుమల్లి చెంచురామయ్య | బళ్ళారి | 2116 |
| 160 కల్లూరి శంకర్ | బళ్ళారి | 2116 |
| 161 రావిపాటి వెంకట్రావు | భీమవరం | 2500 |
| 162. చేబ్రోలు ఆంజనేయులు | | 3000 |
| 163. చేబ్రోలు కనకారావు | ఆగ్రం | 200 |
| 164 పోలినేని రంగనాయుడు | దైవాలరావూరు | 1116 |
| 165. వున్నం వెంకయ్య | దైవాలరావూరు | 1116 |
| 166 పాతురి శేషారావు | దైవాలరావూరు | 1116 |
| 167 కనుబొద్దు అంజిరెడ్డి | దైవాలరావూరు | 1116 |
| 168 రావి వెంకటేశ్వర్లు | దైవాలరావూరు | 1116 |
| 169. రావి సుబ్బారావు | దైవాలరావూరు | 1001 |
| 170. పిడసరి వీరారెడ్డి | దైవాలరావూరు | 1001 |
| 171. రావి సత్యనారాయణ | దైవాలరావూరు | 1001 |
| 172 పరాశరం వెంకటేశ్వరాచార్యులు | దైవాలరావూరు | 1001 |
| 173.కోనూరి వెంకటేశ్వర్లు | దైవాలరావూరు | 1116 |
| 174. శింగునేని ఆదినారాయణ | దైవాలరావూరు | 1116 |
| 175. లింగాచిన హనుమంతరావు | దైవాలరావూరు | 1116 |
| 176. మద్దినేని వెంకటేశ్వర్లు | దైవాలరావూరు | 1001 |
| 177. చెన్నుపాటి వెంకటేశ్వర రావు | దైవాలరావూరు | 1116 |
| 178. కొప్పరావూరి కోటిశెట్టి | దైవాలరావూరు | 1116 |
| 179 తొట్టెంపూడి వెంకటేశ్వర్లు | దైవాలరావూరు | 1116 |
| 180. తగిరిశ నారాయణ | హైదరాబాద్ | 1001 |
| 181. జి.వి. చలపతిరావు | హైదరాబాద్ | 1116 |
| 182. బి. మడుగుల లక్ష్మీనారాయణ | హైదరాబాద్ | 1001 |
| 183. కె. సిహెచ్. సుబ్బారావు | హైదరాబాద్ | 1116 |
| 184. కోనేరు శివప్రసాద్ | హైదరాబాద్ | 1116 |
| 185 మారెడ్డి వెంకటరెడ్డి | మణికేశ్వరం | 1116 |
| 186 మండువ శివాజి | హైదరాబాద్ | 1116 |
| 187. కుక్కపల్లి వెంకట రంగారావు | హైదరాబాద్ | 1116 |
| 188. చలసాని కృష్ణారావు | హైదరాబాద్ | 1116 |
| 189. క్రియేటివ్ కన్‌స్ట్రక్షన్స్ | హైదరాబాద్ | 1116 |
| 190.మోదేపల్లి కొండయ్య | హైదరాబాద్ | 1116 |
| 191. వై. రామమోహనరావు | హైదరాబాద్ | 1116 |
| 192. దొడ్డ నూరయ్య | బొల్లవరప్పాడు | 1116 |

| | | |
|---|---|---|
| 193 కోని శివరావు | బొల్లవరప్పాడు | 1116 |
| 194 కోని శివరావు | బొల్లవరప్పాడు | 1116 |
| 195 కుర్రా వెంకట శేషయ్య | బొల్లవరప్పాడు | 1116 |
| 196. గుడిపాటి పోతులరాజు | ముప్పాళ్ళ | 1116 |
| 197 యం. అంజిరెడ్డి | ముప్పాళ్ళ | 1116 |
| 198 కల్లూరి రత్తయ్య | ముప్పాళ్ళ | 1116 |
| 199 మోపర్తి పున్నయ్య | యం.యం టి | 1116 |
| 200. గోవి వెంకటేశ్వర్లు | యం.యం.టి. | 1116 |
| 201 రవి కాన్వెంట్ | విజయవాడ | 1116 |
| 202 పొదర్తి వెంకటరత్నం | | 1116 |
| 203 చప్పిడి హనుమంతరావు | రావినూతల | 1000 |
| 204. సదరన కాటన్ ట్రేడర్స్ | రావినూతల | 1116 |
| 205. శ్రీహనుమాన్ ట్రేడర్స్ | అద్దంకి | 1116 |
| 206. దేను వెంకయ్య | ఒంగోలు | 1116 |
| 207. గుప్తా ఐరన్ కంపెనీ | ఒంగోలు | 1116 |
| 208 సి.హెచ్ భద్రయ్య | ఒంగోలు | 1001 |
| 209. కనుమర్లపూడి నారాయణశెట్టి | ఒంగోలు | 1001 |
| 210. నారిపెద్ది కృష్ణమూర్తి | | 1116 |
| 211 గోరంట్ల మహాలక్ష్మమ్మ | కొల్లువారిపాలెం | 1001 |
| 212. నూతలపాటి శేషయ్య | కె. తక్కెళ్ళపాడు | 1001 |
| 213. నాగండ్ల వెంకటేశ్వర్లు | దైవాలరావూరు | 1116 |
| 214 యల్లశిరి వెంకటేశ్వర్లు | | 1116 |
| 215. గండవళ్ళ కోటేశ్వరరావు | కె తక్కెళ్ళపాడు | 1116 |
| 216. పరిగల వీరయ్య | కె. తక్కెళ్ళపాడు | 1116 |
| 217. ఎడియాల రుద్రమరావ్ | కె. తక్కెళ్ళపాడు | 1116 |
| 218 పావులూరి సుబ్బారావు | కె. తక్కెళ్ళపాడు | 1116 |
| 219. నాగండ్ల బసవయ్య | కె. తక్కెళ్ళపాడు | 1116 |
| 220. నర్రా భాస్కరరావు | కె. తక్కెళ్ళపాడు | 1116 |
| 221. చప్పిడి వీరమ్మ | రావినూతల | 1116 |
| 222. కందిమళ్ళ రామయ్య | తిమ్మసముద్రం | 1116 |
| 223. కోయి సుబ్బారావు | తిమ్మసముద్రం | 1116 |
| 224. బోడపాటి సుబ్బారావు | తిమ్మసముద్రం | 1116 |
| 225. పెద్ది వెంకటేశ్వర్లు | తిమ్మసముద్రం | 1116 |
| 226. గుళ్ళావల్లి ఆంజనేయులు | తిమ్మసముద్రం | 1116 |
| 227. యడవలి వీరాస్వామి | గొణినపూడి | 1116 |
| 228. వెనుపాటి మోహన్‌రావు | బళ్ళారి | 1116 |

| | | |
|---|---|---|
| 229 చెన్నుపాటి శివరావు | బళ్ళారి | 1116 |
| 230 ర్యావిపాటి శ్రీరాములు | బళ్ళారి | 1116 |
| 231 నాదెండ్ల శ్రీనివాసరావు | ఆదిపూడి | 1116 |
| 232 మన్నం వెంకటేశ్వర్లు | ఏలూరివారిపాలెం | 1116 |
| 233. పేరం సుబ్బారెడ్డి | గుంటూరు | 1116 |
| 234 కరారి శింగయ్య | ఆదిపూడి | 1116 |
| 235. కూళ్ళూరి దొడ్డనగౌడ | శంకరజండ | 1116 |
| 236. కందేపి వెంకట సుబ్బారావు | ఒంగోలు | 1116 |
| 237 యనమండ్ర లలితాదేవి | హైదరాబాద్ | 1116 |
| 238. దేసుమల్లిఖార్జునరావు | దైవాలరావూరు | 3000 |
| 239 ఈటుకూరి సుబ్బారావు | దైవాలరావూరు | 1116 |
| 240. సోమ అమణమ్మ | టంగుటూరు | 1116 |
| 241. పాతూరి పోతురాజు | దైవాలరావూరు | 1116 |
| 242. పల్లపోతురాధకృష్ణమూర్తి | దైవాలరావూరు | 1116 |
| 243 రావినూతల వెంకటప్పయ్య | బొల్లవరప్పాడు | 1116 |
| 244 కాకర సుబ్బారావు | కె తక్కెళ్ళపాడు | 1116 |
| 245 కప్పర వెంకటేశ్వర్లు | ఒంగోలు | 1116 |
| 246 యకుల తులశీరావు | ఒంగోలు | 1116 |
| 247. బత్తుల సాంబిరెడ్డి | యర్రంవారిపాలెం | 1116 |
| 248. చేబ్రోలు వెంకాయమ్మ | దైవాలరావూరు | 1116 |
| 249. రావి వెంకట వరప్రసాద్ | దైవాలరావూరు | 1116 |
| 250. పిన్నింటి కృష్ణయ్య | దైవాలరావూరు | 1116 |
| 251. రావి వెంకటేశ్వర్లు | దైవాలరావూరు | 1116 |
| 252 రావి కోటయ్య | దైవాలరావూరు | 1116 |
| 253 చేబ్రోలు సుబ్బారావు | రావినూతల | 1116 |
| 254 మామిళ్ళపల్లి హనుమంతరావు | పమిడిపాడు | 3000 |
| 256. వల్లేటి రత్తమ్మ | బొల్లాపల్లి | 1116 |
| 257. తొట్టెంపూడి రామారావు | దైవాలరావూరు | 1116 |
| 258. ఆళ్ళ యల్లమంద | దైవాలరావూరు | 1116 |
| 259. ఎస్.ఆర్. బాబులరెడ్డి | బళ్ళారి | 2116 |
| 260. చల్లగుండ నాగేశ్వరరావు | కుర్రవానిపాలెం | 1016 |
| 261. శానంపూడి చంద్రరావు | | 1116 |
| 262. యరమాను బాలయ్య | | 1116 |
| 263. ఆర్. యర్రణగౌడ్ | బళ్ళారి | 1016 |
| 264. చెరుకూరు కోటేశ్వర్లు | గొణినపూడి | 1116 |

